Photo by B. Ranganathan



బహుమతి
పొందిన వ్యాఖ్య

సంతోషానికి సాటిలేదు

పంపినవారు:
బి. సి. కళాపతి - విజయవాడ

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు



ఇవిగాక :
ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



పూజనీయులైన మా అభిమానులందరికీ
హృదయపూర్వకమైన
దీపావళీ అభివందనములు

# ఫోమ్రా బ్రదర్స్

'ఫోమ్రా హవుస్'

392, మింట్ స్ట్రీట్, మదరాసు-1

ఫోన్ నెం. 3845-3078 :: తంతి: "PHUMBHRA"





సమస్తమైన
ఎలక్ట్రిక్ పరికరములు

గృహోపయోగములకు
పారిశ్రామికములకు వ॥



సప్లయిదారులు, సుప్రసిద్ధ స్టాకిస్టులు
(కేటలాగు కొరకు నేడే వ్రాయండి)



ఇదుగో...నీ
అశోకా
అశోకా పెన్ వర్క్సు
తెనాలి
ఆంధ్ర

# ఏ రకపు
# ఆభరణాలైనా

గాజులుగాని కంఠహారములు కాని కంకణములుగాని, చెవిపోగులే గాని ముక్కుకాడలేకానీ—బంగారు ఆభరణాలు ఏవైనా సరే (సాదావి, నగిషీ చెక్కినవి, రత్నాలు పొదిగినవి), ఇవిగాక—వెండితో వేసిన డిన్నర్, టీ, కాఫీ లేక లెమన్‌సెట్లు—అనేక రకాలు, నమూనాలు సిద్ధంగా ఉన్నవి. . . . . . .

కావాలంటే, మీ కొలతల ప్రకారం సరీగా తయారుచేసి యివ్వబడును.

అసమానమైన పనితనము.





*Vummidi*

**RAMIAH CHETTY, GURUSWAMY CHETTY & CO.,** *Jewellers*

23-25, CHINA BAZAAR ROAD, MADRAS—1.

**ఉమ్మిడి రామయ్యశెట్టి, గురుస్వామిశెట్టి అండ్ కో.,**

నగలవర్తకులు, 23-25 చైనాబజార్ రోడ్డు, మద్రాసు - 1.

*ఆంధ్ర ప్రదేశ్ అవతరణ సందర్భంలో*

*ఆంధ్ర ప్రజానీకానికి* **విజయ పిక్చర్సు** *సమర్పించు*

*దీపావళి పుష్పాంజలి*

విజయ వారి

## మాయాబజార్

డైరెక్షన్... కె.వి.రెడ్డి, B Sc (Hons)

యన్.టి.రామారావు..నాగేశ్వరరావు

రంగారావు ...రేలంగి... సావిత్రి

## అప్పుచేసి పప్పుకూడు

డైరెక్షన్... ప్రసాద్

## రేచుక్క-పగటిచుక్క

డైరెక్షన్... కె.కామేశ్వరరావు బి.ఎ.

యన్.టి. రామారావు...రంగారావు

*

ఆర్ ఆర్. పిక్చర్సు వారి

## కార్తవరాయునికథ

యన్.టి.రామారావు..రమణారెడ్డి.. ముక్కామల

పద్మనాభం .బాలకృష్ణ..కె.వి.ఎస్.శర్మ

కన్నాంబ .బి యస్ సరోజ...సురభి బాలసరస్వతి

డైరెక్షన్...రామణ్ణ

*

## ప్రొడక్షన్ నెం. 5

డైరెక్షన్..రామణ్ణ

ఎ.వి.ఎం. వారి

## ? (జానపద చిత్రం)

## భూకైలాస్

*

గుబ్బికర్ణాటకా వారి

## ప్రభామణి విజయం

*

నేషనల్ పిక్చర్సు వారి

## పరాశక్తి

డైరెక్షన్....కృష్ణన్.పంజు

శివాజిగణేశన్...శ్రీరంజని

*

భాస్కర్ ప్రొడక్షన్సు వారి

## రేపు నీదే

*(రాయలసీమకు మాత్రమే)*

డైరెక్షన్...భాస్కరరావు

రంగారావు..రేలంగి..జగ్గయ్య..జానకి

కృష్ణకుమారి...రాజసులోచన

*

## ప్రొడక్షన్ నెం. 4

*రాబోవు*

*మా హిందీ చిత్రాలు*

ఎ.వి.ఎం. వారి

## చోరి-చోరి

నర్గిస్..రాజ్ కపూర్ * * * డైరెక్షన్...అనంత్ ఠాకూర్

**హం పంచి ఏక్ ఢాల్ కే** * **మిస్ మేరి**

డైరెక్షన్.... సంతోష్ * * * డైరెక్షన్... ప్రసాద్

రాజ్ కమల్ కళామందిర్ వారి

**దోఆంఖే బారాహాత్** * **?** * **?** పంచరంగులచిత్రం

డైరెక్షన్.వి.శాంతారాం



**విజయ పిక్చర్సు : విజయవాడ ః గుంటకల్**




## ఆరోగ్యవంతులైన జనులు ప్రతిరోజూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుదురు

– అది ప్రతిదిన* మలినములోని క్రిములను కడిగివేయును!

* మనకు ప్రతిదినం తార్సపడే మామూలు మురికిలో క్రిములున్నాయి. మనలో ప్రతివారికీ యీ క్రిముల వల్ల రోగాల ప్రమాదం వుంది. అందుచేతనే చాలమంది ఆరోగ్యవంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగివేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.

L. 263-50 TL

భారతదేశంలో తయారుచేయబడినది

# THE EAST ASIATIC CO. (INDIA)

## PRIVATE LIMITED,

### MACHINERY & ENGINEERING DEPARTMENT,

**BOMBAY-CALCUTTA-MADRAS-NEW DELHI-BANGALORE CITY-SECUNDERABAD (Dn.)**



*Agents and Distributors for:*

**"ORIGINAL HEIDELBERG" AUTOMATIC PRINTING MACHINES**
**10″ × 15″, 12″ × 18″ & 21″ × 28″ sizes**
*of Schnellpressenfabrik Ag Heidelberg, West Germany.*

**"POLAR" AUTOMATIC PAPER CUTTING MACHINES 32″, 42″ & 52″ sizes**
*of Adolf Mohr Maschinenfabrik, West Germany.*

**"HOHNER" PLATENS & WIRE STITCHING MACHINES**
*of Otto Hohner Maschinenbau, West Germany.*

**"CORNERSTONE" COMPOSING ROOM EQUIPMENT**
*of Hawthorn Baker Ltd., England.*

**LAMINATING MACHINES**
*of Maschinenfabrik Karl Hennecke, West Germany.*

**WELDING SETS, AIR COMPRESSORS & SIGMA PUMPS**
*of Strojexport, Czechoslovakia.*

**MACHINE TOOLS FOR METAL & WOOD WORKING TRADES**
*of Metalexport, Poland.*

**ENGINEERS' LATHES**
*of Heroes Engineering Co. Ltd., Calcutta*

**'ORIENTAL' DIESEL ENGINES**
*of Oriental Engineering Works Ltd., Jagadhri*

**'DELTA' PUMPS**
*of Delta Engineering Co. Ltd., Meerut.*

ఆంధ్రదేశమంతటా విజయవంతంగా నడుస్తున్నది!




జగ్గయ్య, రేలంగి, చలం, గుమ్మడి, జి. వరలక్ష్మి, కృష్ణకుమారి,
సూర్యాకాంతం, సురభిబాలసరస్వతి వగైరా నటించిరి.

సంగీతము : రాజేశ్వరరావు ✶ దర్శకత్వం : సుబ్బారావు,

కథ, పాటలు, మాటలు : సముద్రాల సీనియర్, జూనియర్



మాతృమూర్తికి మంచి స్నేహితుడు
ఓ! మళ్లీ జలుబు! పాపం పాప!
అచ్ అచ్ అచ్ అచ్
మోకాలు నొప్పిచేసింది ఇవాళ్ల ఆఫీసుకు వెళ్లినట్లే!!
అమ్మా! నావేలు బెణికింది! మ్యాచ్ ఇవాళ్ల. ఎలా ఆడటం?




డాక్టరు వద్ద
...కాదు! తలనొప్పికే మాత్రమే కాదు-లిటిల్స్ ఓరియంటల్ బామ్ బెణుకులకు కాళ్ల నొప్పులకు, ఇతర కండరాల నొప్పులకు వాడవచ్చు జలుబు దగ్గులకు ప్రత్యేకించి మంచిది!!
కొంతసేపు అయినాక
అంత త్వరలో అంతా చక్కబడింది ఓరియంటల్ బామ్‌కు ధన్యవాదాలు
అవును నాకు అన్నం పెట్టు. ఆఫీసుకు పోతా!
ఇవ్వాళ్ల మ్యాచ్‌లో గెలవాలని దీవించు బాబా!
ఏకుటుంబం లిటిల్స్ ఓరియంటల్ బామ్ లేకుండా వుండరాదు.
లిటిల్స్ ఓరియంటల్ బామ్ జలుబు, నొప్పులకు

POORNA PENS

INSPIRE THOUGHT

POORNA INDUSTRIES GANDHINAGAR VIJAYAWADA-2

---

ఆంధ్ర ప్రదేశ్ అవతరణ,

దీపావళీ శుభసమయాన

మిత్రులందరికి

మా శుభాభినందనలు!

**SAMSONS DRESSES**

కోస్తా జిల్లాలకు విక్రయ ప్రతినిధులు

## గొల్లపూడి బ్రదర్స్,

గాంధినగర్ :: విజయవాడ - 2

(వ్యాపార నిబంధనలకు వ్రాయండి)

---

## మీ బిడ్డ...

1, 3 సంవత్సరముల మధ్య, శాఖాహారులైన మగ బిడ్డలలో, లివర్ వ్యాధులు సామాన్యమని, మా లెక్కలవల్ల తేలుచున్నది.

తరుచుగ అజీర్ణ వ్యాధులు, కడుపు ఉబ్బరము, చికాకు పడుట, కోపము, ఆకలి మందగించుట మొదలైన గుణములు లివర్ వ్యాధిని సూచించు లక్షణములు.

సకాలంలో జమ్మివారిని సలహా చేయుండి.

జమ్మిస్

# లివర్ క్యూర్

జమ్మి వెంకటరమణయ్య & సన్స్

జమ్మి బిల్డింగ్స్, మైలాపూర్, మద్రాసు-4.

బ్రాంచిలు: విజయవాడ, కాళంతివారి వీధి, గవర్నరుపేట. విజయనగరము సిటి: కొండగంటివారి వీధి.



1-11-'56 నుండి ఆంధ్రదేశమందంతటా
ప్రదర్శింపబడుచున్నది!





నర్గీస్
రాజ్ కపూర్
భగవాన్ • గోప్
జాని వాకర్
డేవిడ్ • ప్రాణ్
రాజ మెహరా
ముకరి
రాజసులోచన

నృత్యములు
కుమారి కమల
సాయి • సుబ్బులక్ష్మి

ఎ.వి.ఎం. ప్రొడక్షన్సు వారి

# చోరి చోరి

హిందీ

సంగీత దర్శకత్వం:
శంకర్ జైకిషన్

దర్శకత్వం:
అనంత్ ఠాకుర్




G.H.RAO



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

దీపావళీ శుభ సమయాన మా పాఠకుల కందరికీ "చంద మామ" శుభాకాంక్షలు తెలుపుకుంటున్నది!

ఈ దీపావళి ప్రత్యేక సంచికను ఆకర్షవంతంగా చెయ్యటానికి కథలూ, కార్టూనులూ, చిన్న కథలూ, బొమ్మలూ అంద జేసిన పాఠకులకూ, ఇతరులకూ ఎంతో కృతజ్ఞులం.

"భువనసుందరి" సీరియల్‌కు స్వాగతం చెబుతూ అనేక మంది పాఠకులు లేఖలు వ్రాశారు. ఈ రకమైన సీరియల్ "చందమామ" లో ఒకటి ఉండేందుకు కృషిచేయగలము.

"కలలమర్మం" [జాతక కథ] లో బుద్ధ భగవానుడు విమ ర్శించే సాంఘిక పరిస్థితులు కొన్ని ఈ నాడు మనం ప్రపంచంలో అక్కడక్కడా చూస్తూ ఉన్నవే. అలాటి నీతు లుండటం చేతనే జాతక కథలు ఈ నాటికీ ఉత్తమ సాహిత్యంగా రాణించుతున్నాయి.

"దాన కర్ణుడు" [బేతాళ కథ] లో కూడా చక్కని నీతి ఉన్నది. ధనకాంక్ష గలవారిలాగే, కీర్తికాంక్ష గలవారు కూడా దుర్మార్గానికి దిగే అవకాశం ఉన్నదని ఈ కథ సూచిస్తున్నది. సత్కర్మ ద్వారా లభించేదే నిజమైన కీర్తిగాని, దుర్మార్గం ద్వారా సాధించే కీర్తి ఎన్నటికీ మంచిది కాదు. దానివల్ల మొదలుకే మోసం వస్తుంది.

# నిప్పుకోడి—టపాకాయ










కోసలదేశానికి రాజైన బింబిసార మహారాజుకు ఒకనాటి రాత్రి చాలా విడ్డూరమైన కలలు వచ్చాయి. మర్నాడు మహారాజు బ్రాహ్మణులను పిలిపించి, తనకు వచ్చిన కలలనుగురించి వారికి చెప్పి, "ఇటువంటి స్వప్నాలకు ఫలితం ఏమిటో ఆలోచించి చెప్పండి!" అని కోరాడు.

బ్రాహ్మణులు తమలో తాము కూడ బలుక్కున్నారు. రాజువద్దనుంచి అంతు లేని ధనం గుంజుకోవటానికి ఇది మంచి అవకాశం. ఇది పోనివ్వకూడదని నిశ్చయించినవారై, బ్రాహ్మణులు రాజువద్దకు వెళ్లి, "మహారాజా, ఎన్నో గ్రంథాలు తిరగవేశాం. మీకు వచ్చిన కలలు చాలా ప్రమాదం కలిగించేవి. వాటివల్ల మీకూ, మీ వంశానికీ, మీ రాజ్యానికీ, మీ ప్రజలకు కూడా గొప్ప అరిష్టం కలగనున్నది!" అని చెప్పారు.

ఈ మాటలు వినగానే రాజుకు మతి పోయినట్టయింది. "అయితే ఈ అరిష్టాలను నివారించే మార్గం ఏమిటి?" అని ఆయన అడిగాడు.

"అదికూడా చూసే వచ్చాం. దీనికల్లా ఒకటే విరుగుడు. మన రాజ్యంలో నాలుగు దారులు కలిసిన చోటనల్లా ఒక యజ్ఞం చేయించండి. యజ్ఞం ముగిసినాక బ్రాహ్మణులకు సంతర్పణలూ, దానాలూ ఇవ్వండి. దానితో అన్ని పీడలూ విరగడ అయిపోతాయి, మేలు కలుగుతుంది." అని బ్రాహ్మణులు సలహా ఇచ్చారు.

బింబిసార మహారాజు ముందూ వెనకా చూడకుండా, బ్రాహ్మణులు చెప్పినదంతా నమ్మేసి, తన కోశాధికారిని పిలిచి, "నాలుగు దారులు కలిసిన చోటనల్లా యజ్ఞం జరగాలి. సంతర్పణలూ, సంభావనలూ, దానాలూ మొదలైనవి జరగాలి.





అందుకుగాను సన్నాహాలు ప్రారంభించండి," అని చెప్పాడు.

ఈ వార్త మహారాణీ తెలుసుకున్నది. అవిడ తన భర్తవద్దకు వెళ్లి, "ఏమండీ, మీరు తొందరపడి ఈ యజ్ఞాలు ప్రారంభించకండి. నిజానికి ఈ బ్రాహ్మణులేమంత తెలిసినవారు కారు. అన్నీ తెలిసిన మహాజ్ఞాని, బుద్ధభగవానుడు జేతవనంలో ఉంటున్నాడు. మీరు అక్కడికి వెళ్లి, ఆయనకు మీ కలల వైనం చెప్పి, వాటి ఫలితం ఏమిటో అడగండి, ఆయన చెయ్యమంటే యజ్ఞాలు అలాగే చేతురుగాని!" అన్నది.

దీనికి బింబిసార మహారాజు అంగీకరించాడు. ఆయన స్వయంగా జేతవనానికి వెళ్లి బుద్ధభగవానుణ్ణి తమ యింట భిక్షకు ఆహ్వానించాడు. బుద్ధుడు ఆ ప్రకారమే భిక్షకోసం రాజసౌధానికి వచ్చాడు.

అప్పుడు మహారాజు బుద్ధభగవానుడితో, "స్వామీ, తమకు తెలియని రహస్యాలుండవు. నాకు కొన్ని పీడకలలు వచ్చాయి. వాటివల్ల కలిగే దుష్ఫలితా లేవో తమరు తెలియజేయాలని నా ప్రార్థన!" అన్నాడు.

"ఆ కలలు ఏమిటో చెబితే ఫలితాలు చెప్పగలను," అన్నాడు బుద్ధుడు, రాజు అమాయికత్వానికి నవ్వుతూ.



"మొట్టమొదటగా నేను కలలో నాలుగు ఆబోతులను చూశాను. అవి భీకరంగా రంకెలువేస్తూ రాజసౌధం ఆవరణలోకి వచ్చాయి. అవి పోట్లాడుకుంటే చూసి ఆనందించుదామని జనం గుంపులు గుంపులుగా వచ్చారు. కాని ఆ ఆబోతులు పోట్లాడుకోక, దేని దారిన అవి వెళ్ళిపోయాయి. దీని అర్థమేమిటి?" అని మహారాజు అడిగాడు.

"రాజా, ఈ కల నీకుగాని నీ తరానికి గాని సంబంధించినది కాదు. ముందు యుగాలలో రాజులు పాపకర్ములైపోతారు. అప్పుడు మేఘాలు వచ్చికూడా వర్షించకుండానే వెళ్లిపోతాయి. వాటిమీద ఎంతో ఆశపెట్టుకున్న ప్రజలు నిరాశ చెందుతారు," అన్నాడు బుద్ధుడు.

"తరవాత ఇంకొక వింత చూశాను. భూమిలో పుట్టిన మొక్కలు ఎంతో ఎత్తు ఎదగకుండానే పూలు పూచి, కాయలు కాయటం చూశాను. దీని రహస్యమేమిటి?" అని మహారాజు అడిగాడు.

"నే నింతకు మునుపు చెప్పిన పాపిష్టి కాలంలో స్త్రీలకు బాల్య వివాహాలు జరుగుతాయి. వారు పెరిగి పెద్దవారు కాకపూర్వమే బిడ్డల తల్లులవుతారు! అంతకంటె ఇంకేమీ లేదు!" అన్నాడు బుద్ధుడు.





"ఆవులు దూడలవద్ద పాలు తాగుతున్నట్టు మరొక కల వచ్చింది," అన్నాడు మహారాజు.

"ముసలివాళ్ళు తమ తిండికోసం చిన్నవాళ్ళపై ఆధారపడే దుర్దినాలు రాబోతాయని దాని అర్థం," అన్నాడు బుద్ధుడు.

"తరవాత కలలో కొందరు రైతులను చూశాను. వారు కాడినుంచి బలిష్ఠమైన ఎద్దులను తొలగించి, ఆ కాడికి లేగదూడలను కట్టటం కనిపించింది," అన్నాడు మహారాజు.

"నే నింతకు పూర్వం చెప్పిన అవినీతి గల రాజులు రాజ్యాధికారాలనుంచి సమర్థు



లైన మంత్రులను తొలగించి, ప్రపంచ జ్ఞానం లేని యువకులను ఆ పదవులలో నియోగించబోతారు. అదే ఆ కలకు అర్థం!" అన్నాడు బుద్ధుడు.

"తరవాత ఒక వింత గుర్రాన్ని చూశాను, దానికి రెండు వైపులా తలలున్నాయి. ఆ రెండు తలలతోటీ అది దాణా తింటున్నది. ఈ ఘోరం ఏమిటి, స్వామీ?" అని మహారాజు అడిగాడు.

"రాబోయే పాపిష్టికాలంలో న్యాయాధికారులు తగాదాలు పరిష్కరించటంలో నిష్పాక్షికంగా ఉండటానికి బదులు, రెండు పక్షాలవారినుంచీ లంచాలు మేస్తారు. ఎవరికీ న్యాయం చెయ్యరు. అదే దాని అర్థం," అన్నాడు బుద్ధుడు.

"ఇదేమిటో చెప్పండి. ఒకడు మోకు అల్లుతూ, అల్లిన భాగం కింద వేస్తున్నాడు. వాడు చూడకుండా ఒక ఆడనక్క అల్లిన మోకును తినేస్తూ కనిపించింది," అన్నాడు మహారాజు.

"రాబోయే కాలంలో పాపం పెరిగిపోతుంది. ఆ సమాజంలో భర్తలు కష్టపడి కూడబెట్టిన ధనాన్ని భార్యలు ఎప్పటికప్పుడు ఖర్చు చేసేస్తూంటారు," అన్నాడు బుద్ధుడు.









"తరవాత ఇంకొక చిత్రం చూశాను. రాజభవనం పక్కనే ఒక పెద్ద కడవనిండా నీరున్నది. దాని చుట్టూ ఇంకా చిన్న కడవలెన్నో ఖాళీగా ఉన్నాయి. అక్కడికి అన్ని కులాలవారూ నీరు పట్టుకు వచ్చి, అదివరకే నిండివున్న కడవలోనే నీరు పోసి, అది పొర్లిపోతున్న సంగతికూడా గమనించ కుండా వెళ్లిపోతున్నారు. ఖాళీ కడవల్లో ఎవరూ నీరు పొయ్యరు. ఏమిటి దాని అర్థం?" అని మహారాజు అడిగాడు.

"ముందు ముందు అధర్మం పెచ్చు పెరుగుతుంది. ప్రజలు కష్టించి సంపా దించిన ధనమంతా రాజుగారి ఖజానాలో పోస్తారు. ఒక వంక ఖజానాలో ధనం మూలుగుతూ ఉంటే ఇంకో వంక ప్రజల ఇళ్లు ఆ ఖాళీ కుండల్లాగా శూన్యమై ఉంటాయి," అన్నాడు బుద్ధుడు.

"మరొక కలలో ఒక పాత్రలో అన్నం ఉడుకుతూ ఉండటం చూశాను. ఆ అన్న మంతా ఒకరకంగా ఉడకటంలేదు. ఒక భాగంలో ఉడుకు జాస్తి అయి మెతుకు చిమిడి పోయింది. ఒక భాగంలో అన్నం సరిగా ఉడికింది. వేరొక భాగంలో బియ్యం బియ్యంగానే ఉంది," అన్నాడు మహారాజు.

"రాబోయే కాలంలో వ్యవసాయం ఇలాగే ఉండబోతుందని ఈ కల చెబు తున్నది. పాలకులు వరదలనుగురించీ, అనావృష్టిగురించీ తగు శ్రద్ధ తీసుకోరు. అందుచేత కొన్నిచోట్ల వర్షం హెచ్చుగా కురిసి వరదలవల్ల పంటలు పాడవుతాయి. సరిగా వానలు కురిసిన చోట మాత్రం పంటలు సక్రమంగా పండుతాయి. వాన కురవని చోట అసలు పంటలే ఉండవు," అన్నాడు బుద్ధుడు.

"స్వామీ, ఇంకొక కలలో కొందరు మనుషులు అమూల్యమైన మలయ చంద నాన్ని వీధివెంట అమ్ముతూ డబ్బులు





పుచ్చుకుంటూండటం చూశాను," అన్నాడు మహారాజు.

"భవిష్యత్తులో కొందరు నీచులు పవిత్రమైన ధర్మబోధలు ప్రజలకిచ్చి, తుచ్ఛమైన ఐహిక సుఖాలను ప్రతిఫలంగా పుచ్చుకుంటారు," అన్నాడు బుద్ధుడు.

"ఇంకా, నా కలలలో నీళ్ళమీద బరువైన రాళ్ళు తేలి కొట్టుకుపోతూండటం చూశాను. ఒక రాజహంసల గుంపు ఒక కాకి వెనక నడుస్తూ ఉండటం చూశాను. మేకలు పులులను తరిమి చంపి తింటూ ఉంటే, తోడేళ్ళు సయితం భయంతో కంపించటం చూశాను. ఇవన్నీ అరిష్ట దాయకాలు కావా, స్వామీ?" అని మహారాజు అడిగాడు.

"ఈ కలలు నీకుగాని, నీ కాలానికిగాని సంబంధించినవి కానేకావు. వాటినిగురించి నీకు ఎలాటి విచారమూ వద్దు. ఇవన్నీ భవిష్యత్తుకు సంబంధించినవి. భవిష్యత్తులో ధర్మం నశించి పాపం పెరగటంవల్ల ఎంత మహిమ గలవాళ్ళు సయితం నీచులైన రాజుల అనాదరానికి గురిఅయి కాలప్రవాహంలో నీవు చూసిన రాళ్ళలాగా కొట్టుకుపోతారు. పరమ నీచులు పదవులకు రావటంవల్ల రాజహంసలవంటి యోగ్యులు సయితం వారి అడుగుజాడలలోనే నడవవలసిన వారవుతారు. అధములకు అధికార బలం లభించేసరికి సత్యసంపన్నులు కూడా వారిని చూసి భయపడవలసివస్తుంది. అంతేకాదు, సత్యసంపన్నులు అయిన కారణంచేత ఆ అధములు వారిని నిర్మూలించటం కూడా జరుగుతుంది," అన్నాడు బుద్ధుడు.

బింబిసార మహారాజుకు సందేహం తీరిపోయింది. ఆయన భయాలు తొలగిపోయాయి. ఆయన యజ్ఞాలు చేయించే ఆలోచన కట్టిపెట్టి, బుద్ధభగవానుడికి భిక్ష పెట్టి పంపేశాడు.






## 17

[సముద్రకేతుడి దొంగలతో, శివదత్తుకు కొద్దిసేపు యుద్ధంచేసి, అడవిలోకి పారిపోయాడు. అక్కడవారికి దేవమాయి అన్న పేరు గల స్త్రీ కనబడింది. ఆమె వల్ల, శివదత్తుడు మకరమండల వృత్తాంతం విన్నాడు. వజ్రముష్టి ఇరువుర అనుచరులతో ముందు బయలుదేరాడు. అతనికి సముద్రకేతుని దొంగల ముఠా కనిపించింది. తరవాత—]

వజ్రముష్టి, ఉప్పుటేరు అవతలినుంచి విన వస్తున్న, వికృతమైన సవ్వడి విని, తన అనుచరులవైపుకు తిరిగి:

"అది సముద్రకేతుడి దొంగల ముఠా అయివుండ వొచ్చు. వాళ్లెవరైనా—తాగి తందనాలాడుతున్నారని మాత్రం తెలుస్తూనే ఉంది. మీరిక్కడే ఉండండి, నేను తెలుసుకుని వస్తాను!" అంటూ వజ్రముష్టి నేలమీద పాకుతూ పోయి, నీటి ఒడ్డునే ఉన్న ఒక తెప్పను చేజిక్కించుకున్నాడు.

కొద్దిసేపట్లో వజ్రముష్టి అవతలి ఒడ్డు చేరాడు. అతడు తెప్పను ఒడ్డున ఉన్న ఒక అడవిచెట్టుకు బంధించి, పాకుతూ ముందుకు వెళ్ళాడు. సమతలంగా ఉన్న ఒకచోట దాదాపు పదీ పన్నెండుమంది సముద్రకేతుడి అనుచరులు, తమ తమ అయుధాలను కుప్పగా ఒకచోట పడవేసి, ఒళ్లు మరిచేలా తాగి కేకలుపెడుతున్నారు.

వాళ్లను హతమార్చేందుకు, వజ్రముష్టికి ఇదే మంచి అదనుగా కనిపించింది. అతడు








ఒక్క దూకులో పొదమాటునుంచి ముందుకు ఉరికి, 'జై, కాలకేయా!' అంటూ కత్తిచూసి దొంగలమీదికి వురికాడు.

తమమీదికి ఎలాంటి ఘోరప్రమాదం ముంచుకు వస్తున్నదో దొంగల్లో కొందరి కైనా తెలిసేలోపల, వజ్రముష్టి చేతి వాడి కత్తి వాళ్ల తలలను మొండెంనుంచి వేరు చేసింది. ఇంతలో తెప్పరిల్లిన నలుగురైదు గురు, భీకరంగా అరుస్తూ తమ తమ ఆయుధాలకేసి పరిగెత్తే లోపల, వజ్రముష్టి వారినికూడా తుదముట్టించాడు.

ఒక్కగానొక్క దొంగ మాత్రం ఆ గందరగోళంలో వజ్రముష్టినుంచి తప్పుకుని వుప్పు



టేరుకేసి పరిగెత్తగలిగాడు. కాని వజ్రముష్టి అతణ్ణి వదల దలచలేదు. బ్రతికి బయట పడిన ఒక్క దొంగఅయినా, తమకు ముప్పు కలిగించగలడని అతడికి తోచింది.

వజ్రముష్టి, 'జై, కాలకేయా!' అని అరుస్తూ, పారిపోతున్న దొంగకేసి పరిగెత్తాడు. నిరాయుధుడూ, తాగిన మత్తులో తడబడుతూవున్న ఆ సముద్రపు దొంగ వెను తిరిగి వజ్రముష్టి భీకరాకారంకేసి ఒకమారు చూచి, "చచ్చాను!" అని పెద్దగా అరుస్తూ, ఒక్క గెంతున, ఎదురుగావున్న ఉప్పుటేర్లో దూకాడు.

వజ్రముష్టికూడా అతడి వెనకనే ఏటిలో దూకబోయేంతలో, తాటిబొండులా అప్పటి వరకూ నీటిలో తేలుతున్న మొసలి ఒకటి ఆ సముద్రపు దొంగమీదికి వురికింది. కన్నుమూసి తెరిచేంతలో మొసలి, ఆ దొంగను నోట కరుచుకుని పారిపోయింది.

వజ్రముష్టి 'హహ్హహ్హ' అంటూ బిగ్గరగా నవ్వి, తరవాత పళ్లు కొరుకుతూ, "సముద్రకేతుడికి కూడా ఇలాంటి చావు తప్పదు! నా చేతిలో...లేకపోతే...మొసలి వాత బడి...జై, కాలకేయా!" అంటూ అరిచాడు.

ఆ సరికి, వజ్రముష్టి వెంట వచ్చిన ఇద్దరు అనుచరులూ ఏటి ఒడ్డుకు వచ్చి, వజ్రముష్టి






కేసి చేతులు ఊపారు. ఇక జాగుచేయటం మంచిదికాదని భావించి వజ్రముష్టి, తక్షణమే ఒక తెప్పకొయ్యమీద ఎక్కి యివతలి ఒడ్డుకు చేరాడు.

వజ్రముష్టి ఏకాకిగా అంతమంది శత్రువులను హతమార్చటం చూచిన అనుచరులిద్దరూ అతడి ధైర్య సాహసాలను వేనోళ్ల మెచ్చుకున్నారు. తరవాత అందరూ కలిసి శివదత్తుడు వున్న చోటుకు వెళ్ళారు.

వజ్రముష్టిని అంతదూరాన చూస్తూనే శివదత్తుడు, "వెళ్ళిన పని ఏమైంది? సముద్రకేతుడి అనుచరులు ఆ ప్రాంతాల ఎక్కడా లేరుగదా?" అని ప్రశ్నించాడు.

వజ్రముష్టి జరిగినదేమిటో చెప్పేందుకు బిడియపడుతున్నంతలో, వెంటవున్న అనుచరు లిద్దరూ శివదత్తుడికి అతడు చేసిన సాహసకార్యం గురించి వర్ణించి చెప్పారు. శివదత్తుడూ, మందరదేవుడూ వజ్రముష్టి సాహసానికి అచ్చెరువందారు.

"వజ్రముష్టీ! నీ సాహసం కొనియాడదగిందే! నీవు లోగడ కోరినట్టు అవకాశం వుంటే, సముద్రకేతుణ్ణి హతమార్చే పని నీకే వదులుతాను!" అన్నాడు శివదత్తుడు.

దేవమాయి, సముద్రకేతుడి పేరు వింటూనే కోపోద్రేకురాలై, "అయ్యా! వజ్రముష్టి కత్తివాత పడి మరణించినవాళ్ళు ఈ ప్రాంతాల వాడు కాపు వుంచిన వాళ్లయి ఉంటారు. కనుక ఇప్పుడు మనం ఎవరి కంటా బడకుండా అతడి నివాసస్థానం చేరవచ్చు. ఇక్కడికి సుమారు నాలుగైదు మైళ్ల దూరంలో అతడు వుంటున్న ప్రదేశం ఉంది. అక్కడికి మనం చేరాలంటే పడవలమీద, వెళ్ళవలిసిందే!" అన్నది.

"సముద్రకేతుడు వుండేది, పెద్ద దుర్గం లాంటి ప్రదేశం కాదుగదా?" అని అడిగాడు శివదత్తుడు.

అందుకు దేవమాయి, "అక్కడ దుర్గం లాంటి కట్టడాలేమీ లేవు. ఆ ప్రదేశమంతా








సముద్రపు జలంతో నిండివుంటుంది. అక్కడక్కడా ఎత్తయిన భూప్రదేశాలు వున్నవి. అతడు ఉంటున్న ప్రదేశం అలాంటివాటిలో ఒకటి. అతడికి రక్షణ, ఆ ప్రదేశం చుట్టూ ఉన్న ఉప్పునీరు మాత్రమే!" అన్నది.

"అతడి అనుచరులు చాలామంది ఉన్నారుగదా?" అని అడిగాడు శివదత్తుడు.

"అనుచరులకేం, చాలామంది వున్నారు; కాని వాళ్లను మించిన బానిసలూ, శత్రువులుకూడా అక్కడే ఉన్నారు. నేను చాలా కాలం అక్కడే బానిసగా బంధింపబడ్డాను. ఒకసారి మనం, ఆ బానిసలు ఉండే, చావళ్లలో జొరపడి వాళ్లను బంధవిముక్తుల్ని



చేయగలిగితే, ఆ తరవాత మన అవసరం లేకుండా వాళ్ళే సముద్రకేతుణ్ణీ, అతడి అనుచరుల్నీ తుదముట్టించగలరు!" అన్నది దేవమాయి ఉద్రేకంగా.

"ఆ బానిసలు షుమారుగా ఎంతమంది వుంటారు?" అని ప్రశ్నించాడు శివదత్తుడు.

"అయిదు వందలు...ఆరు వందలు—అంతకు తక్కువ మాత్రం ఉండరు!" అన్నది దేవమాయి.

"అయితే, ఇక మనం అక్కడికి బయలుదేరుదాం. వజ్రముష్టి సంపాయించిన చిన్న పడవల సహాయంతో, మనమందరం లోతులేని ఈ ఉప్పుటేర్ల వెంట పోయి, ఆ సముద్రకేతుడి గుహ చేరగలం! చీకటి పడుతున్నది. శత్రువును ఏమరుపాటున ఎదుర్కొని, చావుదెబ్బ కొట్టేందుకు ఇదే మంచి అదను!" అన్నాడు శివదత్తుడు.

అందరూ ఉప్పుటేరు దగ్గిరకు బయలుదేరారు. కొద్దిసేపట్లోనే వారు కనుచూపుమేర జలమయంగా వుండి, మధ్య అక్కడక్కడా పచ్చని చెట్లతో వున్న ఒక మిట్ట ప్రదేశాన్ని చేరారు. సముద్రపు దొంగలు విడిచిన పడవలు అక్కడే చెట్లకు కట్టబడి వున్నవి. అందరూ వాటిమీద ఎక్కి దేవమాయి చూపిన దిక్కుకేసి బయలుదేరారు.









ఆ సరికి బాగా చీకటిపడిపోయింది. నెలవంక ఎక్కడో మేఘాల మాటున వెలవెలపోతోంది. అక్కడికి చాలా దూరంగా, సముద్రకేతుడి నివాసస్థానం వున్న చిన్న ద్వీపఖండంలో మినుకు మినుకు మని వెలిగే దివిటీల కాంతి తప్ప — చుట్టూ, భీతికొలిపే గాఢాంధకారం!

ఆ అంధకారంలో ఒకరినొకరు హెచ్చరించుకుంటూ, పడవలు ఒకదానినొకటి తాకి ప్రమాదం సంభవించకుండా జాగ్రత్తపడుతూ, శివదత్తుడు క్రమక్రమంగా ముందుకు పోసాగాడు. దారిలో అక్కడా ఇక్కడా వున్న మిట్టప్రదేశాలమీది చెట్లలోంచి, నీటిపక్షుల అరుపులు వికృతంగా వినిపిస్తున్నవి. నీటిలో ఆహార సంపాదనకు తిరిగే మొసళ్లు, తదితర క్రూర జంతువులూ పడవలవరకూ వచ్చి, వాటి మీద మనుష్యులు కనబడగానే దూరంగా పారిపోతున్నవి.

దాదాపు నడిరాత్రి వేళకు శివదత్తుడు తన అనుచరులతో సముద్రకేతుడు నివసించే మిట్టప్రాంతపు చాయలకు చేరాడు. ఇప్పుడు చేయవలిసింది, ఏమాత్రపు చడీ చప్పుడూ కాకుండా పశువులవలె చావళ్లలో బంధింపబడివున్న బానిసలను బంధవిముక్తుల్ని చేయటం. వాళ్ళ సాయంతో సముద్రకేతుణ్ణీ అతడి అనుచరులనూ హతమార్చటం!

శివదత్తుడు ఇలా భావించేంతలో, అతడు చేరవలసిన ప్రదేశం సమీపించింది. అందరూ నిశ్శబ్దంగా పడవల మీది నుంచి ఒడ్డుకు దిగారు. తరవాత చెట్ల చాటున నక్కుతూ కొంత దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా ఆ ప్రాంతాన్నంతా పట్టపగలు చేస్తూన్న అనేక వందల దివిటీల కాంతి వాళ్ళ కళ్ళబడింది.

శివదత్తుడు ఆ కాంతి ప్రసరించని గుబురు చెట్లచాటున దాక్కుని తన అను





తెల్లవారితే మకరదేవతకు కావలసిన ఆహారంకోసం ఇక్కడికి వచ్చారు. సముద్రకేతుడు బంధించి తెచ్చినవారిలో, యుక్త వయస్కులూ, ఆరోగ్యవంతులైన వారిని ఎంత వెల అయినా ఇచ్చి కొనుక్కుని వాళ్లు వెళతారు!" అని చెప్పింది.

శివదత్తుడు ఆమె మాటలకు ఆశ్చర్యపోయి, "మకరదేవతకు ఆహారంగా వేసేందుకు మానవులు తప్ప జంతువుల్లాంటివి పనికిరావా? అది ఎంత దేవత అయినా మొసలిగదా!" అన్నాడు.

"మకరమండల వాసులంతా దాన్ని దేవతగానే చూచుకుంటారు, బహుశా క్షుద్ర దేవతగా కావొచ్చు! అది అంటే వారికి ఎక్కడలేని భయం. దానికి జంతువులను బలి ఇవ్వటమంటే, వాళ్లు అపచారంగా భావిస్తారు," అన్నది దేవమాయి.

"ఒకవేళ ఆ మూఢులు భావించేదే నిజమైతే, ఆ క్షుద్రదేవత పాలిటి యముడు మన వెంటనే ఉన్నాడు!" అంటూ శివదత్తుడు, వజ్రముష్టికేసి చేయి ఊపుతూ నవ్వాడు.

"నేను ఆ ఒక్క మకరదేవతకే కాదు, ఈ క్రూర సముద్రకేతుడి పాలిటికూడా యముణ్ణి!" అన్నాడు వజ్రముష్టి కోపంతో పళ్ళు కొరుకుతూ.

చరులను సౌంజ్ఞలతో దగ్గిరకు పిలిచాడు. అందరూ చెట్ల ఆకుల చాటున వుండి, దివిటీల కాంతి వచ్చిన వైపు చూచారు. అక్కడ దాదాపు నలభై యాభై మంది, సముద్రపు దొంగలు; కొందరు నిలబడీ, మరి కొందరూ కూర్చునీ వాళ్లకు కనిపించారు. సముద్రకేతుడు చేతిలో పానపాత్ర పట్టుకుని, మధ్య మధ్య మద్యం సేవిస్తూ, కవచధారులై వున్న నలుగురైదుగురు వ్యక్తులతో ఏమో మాట్లాడుతున్నాడు.

దేవమాయి, తన చూపుడు వేలిని వాళ్ల కేసి చూపుతూ, "ఆ నలుగురూ మకర మండల రాజైన హరిశిఖుడి సైనికులు!





"సరే, ఇక మనం నిశ్శబ్దంగా వెళ్ళి, ఆ బంధితులైన బానిసల్ని విడిపించటం క్షేమం. ఒకవేళ ఆ ప్రయత్నంలో విఫలుల మైతే, మనం వచ్చిన పడవలు ఇక్కడ వుండనే ఉన్నవి, వాటి సాయంతో పారి పోవచ్చు!" అన్నాడు శివదత్తుడు.

దేవమాయి, బానిసలు బంధించబడి వున్న చావిళ్ళకేసి దారితీసింది. అందరూ చెట్లచాటున నక్కుతూ, అటుకేసి నడిచారు. కొద్దిసేపట్లోనే వారు పశువులశాలలాగా వున్న ఒకచోటికి వచ్చారు. దానిలో పశువుల్లా కట్టు కొయ్యలకు వరసాగ్గా చాలామంది మనుష్యులు కాళ్ళూ చేతులకు సంకెళ్ళు వేయబడి బంధింపబడి వున్నారు.

శివదత్తుడు, అనుచరులను హెచ్చరించి మెల్లగా శాలలో ప్రవేశించాడు. వజ్రముష్టి సోలుపుగా కట్టివేయబడిన ఆ బానిసల దగ్గరకు వెళ్ళి, ప్రతి ఒక్కరికీ తాము వచ్చిన పని చెప్పి, నిశ్శబ్దంగా వుండవల సిందని హెచ్చరించాడు.

తమదగ్గిర వున్న ఆయుధాలతో శివ దత్తుడూ, అతడి అనుచరులూ ముందుగా కొందరు బానిసల సంకెళ్ళు వూడగొట్టారు. అలా బంధవిముక్తులైన బానిసలు తమతోటి వారిని బంధవిముక్తుల్ని చేశారు. ఈ విధంగా కొద్దిసేపట్లో ఆ చుట్టుపక్కల శాలల్లో వున్న అందరు బానిసలూ బంధ విముక్తులయ్యారు.

స్వయంప్రభ ఎక్కడ? ఈ ప్రశ్న దేవ మాయినీ, మందరదేవుణ్ణి కూడా మొదటి నుంచీ బాధిస్తూనే వుంది. వాళ్ళు చాలా మంది బానిసలను అడిగిచూశారు. వాళ్ళల్లో ఎవ్వరికీ ఆవిడను గురించి తెలియదు. స్వయంప్రభను ఈసరికే మకరదేవతకు ఆహారంగా వేశారా? అని వాళ్ళు భయ పడేంతలో, ఒక బానిస ముందుకు వచ్చి, "అయ్యా, ఇంతకు ముందే కావలివాళ్లు ఒక సౌందర్యవతి అయిన కన్య దొరికినట్టూ,

ఆమెను చాలా వెలకు సముద్రకేతుకు ఎవరికో అమ్మబోతున్నట్టూ మాట్లాడుకోవటం విన్నాను!" అని చెప్పాడు.

ఈ వార్త దేవమాయితో పాటు అందరికీ చాలా పూరట కలిగించింది. మందర దేవుడు శివదత్తుడి దగ్గిరకు వస్తూ, "శివదత్తా! ఇక్కడ ఇంతమంది బానిసలు ఉన్నారుగదా? వీళ్లకు కాపలా అంటూ ఎవరూ లేకపోవటం వింతగా లేదా?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

శివదత్తుడు ఆ ప్రశ్నకు నవ్వి, "ఈ సముద్రజలం మధ్య ఈ మిట్టమీద కాళ్ళూ చేతులు గొలుసులతో బంధింపబడిన వ్యక్తులు ఎక్కడికి పోగలరు? సరే, ప్రస్తుత కర్తవ్యం సంగతి ఆలోచిద్దాం! స్వయంప్రభ ఈ ప్రాంతంలోనే ఎక్కడో ఉండి ఉంటుంది. మనం ఒక్కుమ్మడిగా ముందు సముద్రకేతుడిమీద పడి, వాణ్ణి అనుచరులతో సర్వనాశనం చేద్దాం!" అన్నాడు.

ఈ లోపల వజ్రముష్టి బానిసలందరినీ ఒక చోట చేర్చి, వాళ్ళకు కర్రలూ, ఇనప చువ్వలూ... ఈ విధంగా ఏవి దొరికితే అది ఇచ్చి, సర్వసన్నద్ధం చేశాడు. శివదత్తుడి ఆజ్ఞ కాగానే అందరూ మూడు భాగాలుగా విభజింప బడ్డారు. శివదత్తుడూ, మందర దేవుడూ, వజ్రముష్టి ఆ మూడు భాగాలకూ ముందుండి దాడి ప్రారంభించాలని నిర్ణయించ బడింది.

అందరూ చెట్లచాటున గల చీకటి ప్రాంతాల వెంట నిశ్శబ్దంగా నడిచి, మూడువైపులనుంచి సముద్రకేతుడి మీదికి భయంకరంగా అరుస్తూ దూకారు. అంత హఠాత్తుగా మీదికి దూకిన శత్రువు లెవరో తెలుసుకుని ప్రతిఘటించే లోపల, సముద్రకేతుడి దొంగల ముఠాలో చాలామంది, శివదత్తుడి అనుచరుల వాడి కత్తులకు బలి అయిపోయారు.

(ఇంకా వుంది)





# ధర్మ నగరం



పూర్వం మిథిలానగరంలో యశవర్ధనుడని ఒక క్షత్రియకుమారు డుండేవాడు. వాడు అమిత పరాక్రమవంతుడు, సాహసి. దానికి తోడు వాడు అమితమైన కోపిష్టి. ఎవరి భయమూ లేక వాడు విచ్చలవిడిగా సంచరిస్తూ, దుర్మార్గుడై జీవించసాగాడు. వాడు చెయ్యని పాపకార్యం లేదు. ఎవరైనా తనను యెదిరిస్తే వాళ్లను తన కత్తికి బలి చేస్తూండే వాడు.

కాని కొంతకాలానికి యశవర్ధనుడి పాపం పండింది. ఒకనాడు వాడు రాజుగారి బావమరిదితోనే తలబడ్డాడు. ఇద్దరూ కత్తులు దూశారు. కాని రాజుగారి బావమరిది కత్తి ఎత్తేలోపుగా యశవర్ధనుడు అతన్ని గుండెలో పొడిచేశాడు. ఈ వార్త వినగానే రాజుగారు మండిపడి, యశవర్ధనుణ్ణి పట్టుకుని తల గొట్టమని తన భటులకందరికీ ఉత్తరువిచ్చాడు.

ప్రాణాలతో ఉండాలంటే దేశం విడిచి పారిపోవటం తప్ప మరొక మార్గం లేదు. అందుచేత యశవర్ధనుడు తన గుర్రంమీద యెక్కి పారిపోసాగాడు. అదీ శరవేగంతో కోసులూ, యోజనాలూ దాటి పరిగెత్తి, గుండె పగిలి చచ్చి పడిపోయింది.

తాను ఇంకా దేశం దాటి పోలేదేమోననీ, తనకోసం రాజభటులు తరుముకుంటూ వస్తున్నారేమోననీ భయపడి యశవర్ధనుడు, అలిసిపోయి ఆకలి దప్పులతో బాధపడుతూ కూడా ఆ చీకటిలోనే అడవుల వెంటా, కొండలవెంటా పరిగెత్తి తెల్లవారేసరికి ఒక కొండ శిఖరానికి చేరాడు. అక్కడ అతను కాస్సేపు విశ్రమించి తాను వచ్చిన దారిని పరీక్షించాడు. తనవెంట ఎవరూ రావటం లేదని రూఢిచేసుకుని కొండ అవతలి వేపు చూశాడు. అక్కడ ఒక లోయలో అమిత అందమైన నగరం ఒకటి అతనికి కనబడింది.

టి. నారాయణరావు

ఆ నగరాన్ని చూడగానే యశవర్ధనుడికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఎందుకంటే, తమ రాజ్యంలో అటువంటి నగరం ఒకటి ఉందని అతనెన్నడూ వినలేదు. ఇది ఇంకో రాజ్యం అయివుంటుంది. ఇక్కడతను క్షేమంగా, సుఖంగా వుండవచ్చు. ఈ మాట అనుకుని అతను లోయలోకి దిగసాగాడు. మధ్యదారిలో ఒక గొర్రెలకాపరి కనిపించగా యశవర్ధనుడు, "ఆ కనబడే నగరం పేరేమిటి?" అని అడిగాడు.

"ధర్మనగరం," అన్నాడు గొర్రెలకాపరి.

యశవర్ధనుడి అనుమానం రూఢి అయింది. ఇదేదో కొత్త నగరం.

ఆ నగరం కొత్తదే గాక చాలా వింతగా కూడా వుంది. యశవర్ధనుడు నగరం ప్రవేశించి, విశాలమైన వీధులవెంట, ఎత్తయిన మేడల మధ్యగా నడవసాగాడు. వీధిలో యెందరో స్త్రీలూ, పురుషులూ నడుస్తున్నారు. కొందరు నిలబడి మాట్లాడుతున్నారు. వారిలో ఒక్కరుకూడా అనారోగ్యంగా, బలహీనంగా కనబడలేదు.

"ఇదేదో మహా పుణ్యనగరంలాగా వుంది. ఇక్కడ దుఃఖమన్నది కనిపించలేదు," అనుకుంటూ యశవర్ధనుడు ఒక దుకాణం సమీపంగా వచ్చాడు. ఆ సమయాన అతనికొక చిత్రం కంటబడింది. దుకాణదారు



కొనవచ్చినవారితో మాట్లాడుతూవున్న సమయంలో ఎవడో యువకుడు దుకాణం నుంచి ఏదో వస్తువు దొంగిలించి అటూ ఇటూ చూసి, ఏమీ ఎరగనట్టు వీధివెంబడి నడవ సాగాడు. అతను నాలుగడుగులు వేశాడో లేదో, పెద్ద మోతతో ఆ యువకుడి కాళ్ళకింది భూమి విచ్చుకున్నది; వాడు అడుగున పడిపోయాడు; వెంటనే భూమి మళ్లీ మూసుకున్నది.

ఇది కళ్ళారా చూస్తున్న యశవర్ధనుడు చాలాసేపు స్తంభించిపోయాడు. తాను చూసిన ఈ సంఘటన ఇతరులుకూడా చూసినట్టు అతను గమనించాడు. అయితే వారు అతనిలాగా ఆశ్చర్యపడలేదు. ఒక్క క్షణం ఆగి వారు మళ్లీ తమ దారిన వెళ్లారు. వారి కిది పరిపాటిలాగే కనబడింది.

ఈ నగరంలో జనం ఇలాగే మరణిస్తారని యశవర్ధనుడికి త్వరలోనే తెలిసి వచ్చింది. ఇంకా ఎన్నో చోట్ల ఇంకా ఎందరో భూగర్భంలోకి పోవటం అతను కళ్ళారా చూశాడు. అంతేకాదు, వారిలో ఏఒక్కడూ ప్రమాదవశాన చావలేదు. సాటిమానవులకు ఏదో ద్రోహం తలపెట్టినవారి కాళ్ళకిందనే భూమి విచ్చుకున్నది; వాళ్ళే ఇలాటి ఘోర మరణాల పాలైనారు. ఒక చోట ఒక మనిషి నడుస్తూవుంటే ఇంకొక మనిషి



వెనకనుంచి ముందున్నవాణ్ణి బాకుతో పొడవ బోయాడు. అంతలోనే వాడి కాళ్లకింది భూమి పగిలి, వాడు కాస్తా భూగర్భంలోకి పోయాడు. మరొక చోట నలుగురు చేరి ఒక స్త్రీని పట్టుకోవటానికి పరిగెత్తుకుంటూ వస్తుండగా వారికింద భూమి బద్దలయింది, నలుగురూ భూగర్భంలోకి పోయారు, భూమి మళ్లీ మూసుకుపోయింది.

యశవర్ధనుడు తాను చూసిన ఈ వింత మరణాలనుగురించి ఆలోచిస్తూ ఒక చోట నిలబడి, "భూదేవి క్షమించదని తెలిసి కూడా ఈ నగరంలో వుండే ప్రజలెందు కిలా పాపాలు చేస్తారు? వీళ్లకు చచ్చిపోతా మన్నది ఆ క్షణాన జ్ఞాపకం రాదా?" అని తనలో తాను అనుకున్నాడు.

"మీదే ఊరు, నాయనా?" అని అతని సమీపంనుంచే ఒక ప్రశ్న వినిపించింది. యశవర్ధనుడు ఉలిక్కిపడి చూడగా, అతని పక్కనే ఒక సాధువు నిలబడి వున్నాడు.

"మాది మిథిలానగరం!" అన్నాడు యశవర్ధనుడు.

"మీ మిథిలలో మృత్యువు చెప్పి వస్తుందా? అక్కడ ప్రజలు ఆకస్మికంగా చావరా? అంతమాత్రాన వారు పశ్చాత్తాప పడి పాపాలు చేయటం మానేస్తున్నారా?" అని సాధువు అడిగాడు.

యశవర్ధనుడికి ఒక్కసారిగా కళ్లు తెరుచుకున్నట్టయింది. తాను చేసిన పాప కార్యాలన్నిటినీ జ్ఞాపకం తెచ్చుకున్నాడు. అతనికి పశ్చాత్తాపం కలిగింది. అతను సాధువు కాళ్లమీద పడి, "స్వామీ, నేనూ ఒక పాపినే. చావు తప్పించుకోవటానికి ఈ నగరం వచ్చి, తప్పించుకోవలిసింది చావు నుంచి కాదనీ, పాపంనుంచి అనీ తెలుసు కున్నాను. నాకు పుణ్యమార్గం ఉపదేశించండి!" అని ప్రార్థించాడు.

సాధువు యశవర్ధనుడికి పుణ్య మార్గమూ, ధర్మమూ, నీతీ ఉపదేశించాడు.



# తోడేలు ఏకాదశి

ఒకనాడు ఒక తోడేలు గంగానది ఒడ్డున ఆహారంకోసం వెతుక్కుంటూ వుండగా, దానికి తెలియకుండా వరదనీరు చుట్టుముట్టింది. తోడేలు ఒక ఎత్తయిన రాతి మీదికి ఎక్కింది. అక్కడినుంచి ఎట్లా తప్పించుకోవాలో, ఏవిధంగా ఆహారం సంపాదించుకోవాలో దానికి తెలియలేదు.

"అన్నట్టు ఇవాళ ఏకాదశికదా! ఉపవాసం ఉండిపోతాను. పుణ్యం సంపాదించుకుంటాను. ఆహారం లేకపోతే మానెలే!" అనుకున్నది తోడేలు.

ఇంతలో ప్రవాహం వెంట ఈదుకుంటూ వస్తున్న మేక ఒకటి తోడేలును చూడక, అది ఉన్న రాతిమీదికి ఎక్కింది.

దాన్ని చూడగానే తోడేలు, "పుణ్యం సంపాదించాలంటే వచ్చే ఏకాదశికి ఉపవాసం *ఉండవచ్చులే*. ప్రస్తుతానికి ఈ మేకను తింటాను!" అనుకుని, దాని వేపు పరిగెత్తింది.

తోడేలును చూడగానే మేక ఒక్క దూకున నీటిలో పడి ఈదుకుంటూ వెళ్ళిపోయింది.

"ఇంకా నయం! ఆ మేకను తినేశానుకాను! ఉపవాసం భంగమై పుణ్యం కాస్తా పోయేది!" అనుకున్నది తోడేలు.



# దానకర్ణుడు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగిపోయి, చెట్టు మీదినుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, మరొక సారి శ్మశానం దిక్కుగా బయలుదేరాడు. శవంలో వున్న బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తే నాకు చాలా సంతోషంగా వున్నది. ఎందుకంటే నీలాగా ఇచ్చిన మాట నిలబెట్టుకునేవారు, ధనంజయుడివంటి వారు, బహు కొద్దిమంది ఉంటారు. ఆ ధనంజయుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పాడు:

పూర్వం భద్రావతీనగరంలో ధనంజయుడని ఒక మహా ధనికుడుండేవాడు. అనేక మంది ధనికులు ధనం సంపాదించి కీర్తి సంపాదించుకుంటే, ధనంజయుడు తనకున్న ధనాన్ని అడిగినవారికల్లా ఇచ్చి దానకర్ణుడనే ఖ్యాతి దశదిశలా పాకించుకున్నాడు. అయన జీవితమంతా ఎడతెగని

## బేతాళ కథలు



దాన ధర్మాలలో గడిచిపోయింది. ఆయనకు ఎనభై యేళ్ళు నిండాయి. అంత దీర్ఘ కాలంలో ఆయన ఒక్క యాచకుడికి కూడా లేదనలేదు.

భద్రావతికి కొన్ని యోజనాల దూరంలో ఇంకొక నగరం వుండేది. అందులో ధీర వర్మ అనే యువకుడుండేవాడు. అతను కూడా అపార ధనవంతుడు. అతను ధనం జయుడు సంపాదించుకున్న కీర్తినిగురించి విని అసూయపడ్డాడు. "ఈ ధనంజయుడు నాకన్న ధనికుడు కాడు. అటువంటప్పుడు దానకర్ణుడని ఆయన సంపాదించిన కీర్తి నేను మాత్రం ఎందుకు సంపాదించ కూడదు?" అనుకుని అతనుకూడా అడిగిన వారందరికీ లేదనకుండా దానధర్మాలు చేయసాగాడు. కొద్దికాలంలోనే ధీరవర్మను గురించికూడా, ధనంజయుణ్ణి గురించి చెప్పు కున్నట్టే, చెప్పుకోసాగారు.

ఒకనాడు ధీరవర్మ తన ఇంటి ముందు అవరణలో కూచునివుండగా ఒక ముసలిది వచ్చి యాచించింది. ధీరవర్మ ఆమె చేతిలో కొంత డబ్బు పెట్టాడు. ఆమె వెళ్ళిపోయి నట్టే వెళ్లిపోయి, ఇంకో వాకిలిగుండా మళ్లీ వచ్చి చెయ్యి చాచింది. ఇది గమనించి కూడా ధీరవర్మ ఆమెకు మళ్ళీ ధర్మం చేశాడు. కాని ఆ ముసలిది అప్పటికీ





వెళ్ళిపోలేదు—మూడో వాకిలిగుండా మళ్లీ వచ్చింది. ధీరవర్మ ఆమెకు ఈ విధంగా పన్నెండుసార్లు ధర్మం చేసి, మళ్ళీ పదమూడోసారి ఆమె వచ్చినప్పుడు, "ముసలిదానా, ఇప్పటికి పన్నెండుసార్లు నాదగ్గిర దానంపట్టి, మళ్ళీ పదమూడోసారి చెయ్యి చాస్తున్నావు," అన్నాడు.

ముసలిది తాను చేసిన పనికి సిగ్గు పడటానికి బదులుగా, రోషంతో, "నువ్వు ఒక ధర్మదాతవేనా? ధనంజయుడి ఇంటికి ముప్ఫయిరెండు వాకిళ్లు. ప్రతి వాకిలి నుంచీ వెళ్లి ఆయనదగ్గిర దానం తీసుకున్నాను. అప్పటికీ ఆయన నన్ను గుర్తించలేదు. నువ్వు నన్ను రెండోసారే పోల్చావు. ధనంజయు డెక్కడ, నువెక్కడ?" అని చెప్పి వెనక్కు తిరిగి వెళ్లిపోయింది.

ముసలిదాని మాట ధీరవర్మకు డొక్కలో బల్లెంలాగా గుచ్చుకున్నది. "నేను ఇన్ని దానాలు చేస్తున్నా ధనంజయుడికి లోకువే అయానే! ఆ ముసలివాడు చచ్చేదాకా నా కీర్తికి ఆయన కీర్తి అడ్డే. ఆయనను దేవుడు తీసుకుపోయేటట్టు లేడు. నేనే వెళ్లి చంపి వస్తాను. ఆతరవాత నా కీర్తికి అడ్డుండదు," అనుకుని ధీరవర్మ, ఎవరితోనూ చెప్పకుండా తన గుర్రమెక్కి బయలుదేరాడు.

ధీరవర్మ రెండు రోజులు ప్రయాణంచేసి అడవి దాటి భద్రావతి నగరానికి పొయ్యే దారిలో ధనంజయుడు కనిపించాడు. ఆయనకు రోజూ సాయంకాలం వేళ అడవిదాకా నడిచివచ్చే అలవాటున్నది. మామూలు దుస్తులు ధరించి ఉండటంవల్లా, ఒంటరిగా ఉండటంవల్లా, ఆ వచ్చే మనిషి ధనంజయుడై వుంటాడని ధీరవర్మ అనుకోలేదు. అదీగాక ధీరవర్మ ధనంజయుణ్ణి గురించి వినటమేగాని ఎన్నడూ చూసివుండలేదు.

"అయ్యా, ధనంజయుడుండే నివాసానికి దారి చెప్పగలరా?" అని ధీరవర్మ ధనంజయుణ్ణి అడిగాడు.



"ఆయన తెలుసునా? ఆయనను కలుసుకోవాలా?" అని ధనంజయుడు అడిగాడు.

"ఆయనను ఒకసారి కంటచూస్తే చాలు. కలుసుకోవలసిన అవసరంలేదు," అన్నాడు ధీరవర్మ.

ఇందులో ఏదో గుట్టున్నదని ధనంజయుడు తెలుసుకున్నాడు.

"ప్రస్తుతం ధనంజయుడు నగరంలో లేడు. కాని ఆయన వచ్చేదాకా నువు ఆయన భవనంలోనే వుండేటట్టు ఏర్పాటు చేస్తాను. నువ్వెవరో, ఎక్కణ్ణించి వచ్చావో, ఆయనకు తెలియకుండా చూస్తాను," అన్నాడు ధనంజయుడు.

"చాలా కృతజ్ఞుణ్ణి. అదే నాకు కావలిసింది. ఇంతకూ మీ నివాసం యెక్కడ?" అని ధీరవర్మ అడిగాడు.

"ఇంకెక్కడోనా? ఆ ధనంజయుడి నివాసమే నా నివాసంకూడానూ. చిన్నప్పుడు ఒకరిని విడిచి ఒకరం ఉండేవాళ్ళం కాం. ఇప్పటికీ నేను అతని సిబ్బందిలోనే ఉంటున్నాను. అతను అంతవాడైపోయాడు. నేను ఇంకా ఇలాగే ఉన్నాను," అన్నాడు ధనంజయుడు.

"మీకు చాలా అన్యాయం జరిగింది," అంటూ ధీరవర్మ ధనంజయుడి వెంట బయలుదేరాడు. ఇద్దరూ కలిసి ధనంజయుడి భవనం చేరారు. ధీరవర్మను ఒక గదిలో ప్రవేశపెట్టి, నౌకర్లందరితోనూ తానెవరో అతిథికి చెప్పవద్దనీ, తాను నగరంలో లేనట్టు అతనికి చెప్పవలిసిందనీ హెచ్చరించాడు ధనంజయుడు.

రెండు రోజులు గడిచాయి. ధనంజయుడు ప్రతిపూటా వచ్చి ధీరవర్మతో మాట్లాడుతూనే వున్నాడు. కాని ధీరవర్మ తాను వచ్చిన పని మాత్రం బయటపెట్టలేదు. అయితే అతను తనమీది ప్రీతిచేత రాలేదనీ, తనను చూడగోరటంలో అతనికేదో దురుద్దేశమే ఉన్నదనీ ధనంజయుడు

సులువుగా గ్రహించాడు. దీనికి నిదర్శనమేమంటే, తననుగురించి తాను చెడుగా మాట్లాడితే ధీరవర్మ ఆసక్తితో విన్నాడు.

మూడవనాడు ఉదయం ధనంజయుడు ధీరవర్మవద్దకు వెళ్ళి, "నాయనా, ధనంజయుడు ఇంతకుముందే వచ్చాడు, వెళ్ళి ఆయనను చూస్తావా?" అని అడిగాడు.

"వద్దు! వీలయితే దూరంనుంచి చూపండి!" అన్నాడు ధీరవర్మ.

"ఇంతకూ నువు వచ్చిన పని నా చెవిని వేశావు కావు. అది ఎటువంటిదైనా సరే, తప్పక జరిగేటట్టు చూస్తాను. నీకు తగిన సలహాకూడా ఇస్తాను. నీకేమీ సంకోచం వద్దు, చెప్పు!" అని ధనంజయుడు ధీరవర్మను ప్రోత్సహించాడు.

చాలా సేపు సంకోచించి, ధనంజయుడిచేత ప్రమాణాలు చేయించుకుని, చివరకు ధీరవర్మ తాను వచ్చిన పని కాస్తా బయట పెట్టాడు. అతను తనను చంపటానికి వచ్చాడని తెలిసి ధనంజయుడు మొదట నిర్ఘాంత పోయాడు. తరవాత ఆయన ధీరవర్మతో, "ఇది ఏమంత కష్టమైన పనికాదు, బాబూ. సాయంకాలం పొద్దుగూకే ముందుగా ఊరి బయట వున్న అరణ్యంలోకి పోతే ఆయన అక్కడ ఒంటరిగా దొరుకుతాడు," అన్నాడు.



ధీరవర్మ ఆ సాయంకాలం తన గుర్ర మెక్కి బయలుదేరాడు. ఊరు దాటి అడవి ప్రవేశించి కొంత దూరం వెళ్ళేసరికి, ముందుకు నడుస్తూ ఒక వృద్ధుడు కనిపించాడు. ధీరవర్మ ఆయనను సమీపించుతూ, "ముసలివాడా, ఈనాటితో నీ ఆయువు చెల్లింది," అంటూ కత్తి ఎత్తాడు. వృద్ధుడు వెనక్కు తిరిగి చూశాడు. ధీరవర్మ ఎత్తిన చెయ్యి యెత్తినట్టుగానే వుండిపోయింది. "మీరా?" అన్నా డతను.

"అవును, నాయనా! నేనే! ఎంతమందో నన్ను అనేకం యాచించారు. అందరికీ అన్నీ ఇచ్చాను. నువ్వొక్కడవే నా ప్రాణం యాచించావు. కాదనగలనా? నీకు కావలిసింది తీసుకుని వెళ్ళిపో! నీకెవ్వరూ అడ్డం రారు," అన్నాడు ధనంజయుడు.

ధీరవర్మ కన్నీరు కార్చుతూ, "మహాత్మా, నా ఈ అపచారాన్ని క్షమించండి," అన్నాడు దీనంగా.

"నాయనా, నీది ఏమంత అపచారం కాదు. కీర్తికాంక్ష నేరం కాదు. ఆ కీర్తి కోసం యుద్ధాలు చేసి, లక్షలాది జనాన్ని చంపి, రక్తప్రవాహాలలో ఈదేవాళ్ళున్నారు. నీ కీర్తికాంక్ష స్వార్థంతో కూడినది కాదు. నీకున్నదంతా ఇతరులకు దానంచేసి కీర్తి సంపాదించాలనే నీ కోరిక! నువు యెంతో



మంచివాడవు. నేను ఇంక యెంతో కాలం బతికేదికూడా లేదు. నీ కీర్తికి అడ్డుగా వున్న నన్ను హతమార్చి నీ పని ముగించుకో!" అన్నాడు ధనంజయుడు.

"కాదు, స్వామీ. మీరు నాకేదైనా శిక్ష విధిస్తేగాని నేను మీ పాదాలు వదలను!" అంటూ ధీరవర్మ అయన కాళ్ళపై పడ్డాడు.

"నీకంత పట్టుదలగా వుంటే నీ ప్రాయశ్చిత్తానికి ఒక మార్గం చెబుతాను, అలా చెయ్యి. నువు నా పేరు పెట్టుకుని మా యింటికి పోయి జీవితాంతంవరకూ అక్కడే జీవించు. నేను నీ పేరు పెట్టుకుని మీ ఇంట ఉంటాను," అన్నాడు ధనంజయుడు. ధీరవర్మ అందుకు సమ్మతించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ధీరవర్మ ధనంజయుణ్ణి చంపకపోవటానికి నిజమైన కారణం ఏమిటి? ఎంతో కీర్తి గడించిన ధనంజయుడు తన పేరును ధీరవర్మకు యెందుకిచ్చేశాడు? సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

"ధీరవర్మ ధనంజయుణ్ణి చంపకపోవటానికి ఒకటే ప్రబలమైన కారణం వుంది. ధీరవర్మ తన జన్మలో యెన్నడూ చెయ్యని ప్రాణదానం ధనంజయుడు తనకు చేసేస్తున్నాడు. ఆ దానం తాను పుచ్చుకుంటే ఇక తాను యెన్నడూ ధనంజయుడితో సమంకాలేడు. అందుచేతనే అతను దండన కోరాడు. పోతే, ధనంజయుడు తన ప్రఖ్యాతమైన పేరును ధీరవర్మకు యెందుకిచ్చాడంటే, తనకింకా కొద్దికాలమే ఆయుర్దాయం వుంది. ధీరవర్మ యువకుడు. తన పేరు ధీరవర్మ బతికున్నంత కాలమూ జీవించి వుండాలనే ఆశతో అయన ఆ పని చేశాడు," అన్నాడు విక్రమార్కుడు.

ఈవిధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పాపడి పద్దుపుస్తకం

వరాంచాలవరం అనే గ్రామంలో పాపడు అని ఒక తోటకాపు ఉండేవాడు. పాపడు ఏపైన కూరలు పెంచటంలో ఎంతో ప్రవీణుడు. వాడు తనకున్న కొద్దిపాటి భూమిలోనే చక్కగా ఎరువులు తోలి, మడులు వేసి, కాయగూరలు పండించి వాటిని మంచి ధరకు అమ్మి, వచ్చిన డబ్బుతో తృప్తిపడి కాలక్షేపం చేస్తూండేవాడు. తాను పెంచే కాయగూరలమీద వాడికెంత ప్రేమంటే, తనకు నచ్చిన పెద్ద పెద్ద గుమ్మడికాయలు మొదలైనవాటికి వాడు ముద్దుపేర్లుకూడా పెట్టుకునేవాడు.

అ గ్రామంలోనే గవరన్న అని మరొక తోటకాపు ఉండేవాడు. పాపడి పొలంకంటె గవరన్న పొలం పెద్దదికూడానూ. అయినా గవరన్నకు ఎంతసేపూ డబ్బు సంపాదించాలన్న దుగ్దే తప్ప, కూరలు పెంచటంలో కొంచెమైనా తెలివితేటలుగాని, ఓపికగాని లేదు. పాపడి కూరలకు వచ్చే ధర గవరన్నకు ఏనాడూ పలికేదికాదు.

"నువు కాస్త చదువుకున్న వాడివి. ఆ పాపన్నకు ఏ చదువూ లేదు. కాని నువు వాడితో సమంగా కాయలు పండించలేవు!" అని గవరన్నను అందరూ ఎద్దేవా చేసేవారు.

ఒక ఏడు పాపడు అత్యద్భుతమైన మంచి గుమ్మడికాయలు పండించాడు. అంత పెద్ద గుమ్మళ్ళను ఎవరూ ఎన్నడూ చూసి ఉండలేదు. పాపడి ఆనందానికి మేరలేదు. ఎంతో ప్రేమతో, వాడా కాయలకు "ఐరావతం", "పానకంబిందె", "మహలక్ష్మి", "పెద్దక్క", "బంగారం" అని రకరకాలుగా పేర్లు పెట్టుకున్నాడు. ఆ యేడు ఇటువంటి పెద్దకాయలు నలభై దాకా పాపడి పాదులకు కాసాయి.

రేపు సంత అనగా పాపడు తన తోటకు వెళ్లి ఏయే గుమ్మడికాయలను కోసి తీసుకు

ఆర్. శకుంతల

పోవాలో గుర్తుపెట్టుకుని, తెల్లవారుతూనే బండితోసహా రావటానికి నిర్ణయించుకుని ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రి పాపడికి నిద్ర పట్టలేదు. ఆ కాయలను తన చేతిమీదుగా సంతలో అమ్మటమంటే, కని పెంచిన కూతుళ్ళను అత్తవారిళ్ళకు పంపటమే అనిపించింది వాడికి.

మర్నాడు తెల్లవారుతూనే లేచి బండి కట్టుకుని పాపడు తోటకు వెళ్ళాడు. గుమ్మడిపాదుల మధ్యకు వెళ్ళేటప్పటికి పాపడి గుండె గుబుక్కుమన్నది. పెద్ద గుమ్మడికాయ లన్నిటిని ఎవరో కోసుకు పోయారు! పాపడికి మతిపోయినట్టయింది. పిచ్చివాడల్లే పాదులమధ్య చాలా సేపు తిరిగాడు. తన గుమ్మడికాయలను కాజేసిన వాళ్లను తిట్టుకున్నాడు.

అంతలో పాపడి కొక ఆలోచన వచ్చింది. ఒకటీ, రెండూ కాదు—నలభై గుమ్మడి కాయలు! ఎక్కడికి పోగలవు? పోతే సంతకే పోవాలి. వాటిని తను ఎక్కడున్నా గుర్తుపట్టగలడు!

వెంటనే పాపడు బండి ఎక్కి సంతకు బయలుదేరాడు. ఒక గంటలో అక్కడికి చేరి కాయగూరల దుకాణాలన్నీ చూడ సాగాడు. ఒక దుకాణంలో వాడికి తన గుమ్మడికాయలన్నీ ఒక్క కుప్పలో కని



పంచాయి. పాపడు చప్పున దుకాణంవాడి దగ్గిరికి పోయి, "ఇదేం పని? దొంగపని! నా గుమ్మళ్ళు కాజేసి నీ కొట్లో అమ్మకానికి పెడతావా?" అన్నాడు.

దుకాణంవాడు నిర్ఘాంతపోయి, "ఇవి నేను దొంగతనం చెయ్యలేదు. మీ వూరి గవరన్న ఈపూటే నాకివి అమ్మి పది రూపాయలు పట్టుకెళ్ళాడు," అన్నాడు.

"గవరన్న ఇంకా తిరిగి పోలేదు. అవతల ఇంకో అంగడిలో ఉన్నాడు," అని పక్కనున్నవాళ్ళెవరో చెప్పారు.

పాపడు వెంటనే సంతలో ఉండే అధికారిదగ్గిరికి వెళ్లి గవరన్న తన గుమ్మడి కాయలు తెచ్చి సంతలో అమ్మేశాడని ఫిర్యాదు చేశాడు. గవరన్నను నలుగురూ కలిసి దుకాణానికి తెచ్చారు.

"ఈ గుమ్మడికాయలు నీవేనని నీకెట్లా తెలుసు?" అని అధికారి పాపడి నడిగాడు.

"నాకు తెలీకపోవటమేమిటి? నే పెంచినవేగా? ఇదుగో మహలక్ష్మి! ఇదుగో ఐరావతం!" అంటూ ఒక్కొక్క కాయనే పాపడు చూపసాగాడు.

చుట్టూ చేరినవాళ్ళంతా పాపడి అమాయకత్వానికి నవ్వారు. అధికారికూడా నవ్వుతూ, "అది కాదోయ్, ఈ కాయలను నువ్వు గుర్తించటం కాదు, ఇవి నీవేనని



ఇతరులు గుర్తించే సాక్ష్యం ఏదన్నా ఉండాలి," అన్నాడు. పాపడికి ఏమీ పాలుబోలేదు.

అధికారి గవరన్నకేసి తిరిగి, "ఏమోయ్, ఈ గుమ్మడికాయలు నువు దొంగిలించావని పాపన్న అంటున్నాడే? ఏమంటావు?" అని అడిగాడు.

"వాడు అమాయకుడులెండి. నాదగ్గిర నేను పండించే కూరల లెక్కలూ, వాటి అమ్మకం లెక్కలూ రాసిన పద్దుపుస్తకం ఉన్నది. కావలిస్తే ఇప్పుడు పోయి తీసుకు రాగలను," అని గవరన్న చెప్పాడు.

ఈ మాట వినగానే పాపడు, "అయ్యా, ఇవి నా కాయలే అని చూపటానికి నాదగ్గిరా గొప్ప పద్దుపుస్తకం ఉంది. నేనూ తెస్తా!" అన్నాడు. ఈ మాట విని గవరన్న విరగబడి నవ్వాడు.

అధికారి భటులను వెంట యిచ్చి ఇద్దరినీ వాళ్ళ గ్రామానికి పంపాడు. కొంతసేపటికి ఇద్దరూ తిరిగివచ్చారు. గవరన్న తన పద్దుపుస్తకం తెచ్చాడు. పాపడు తన పైబట్ట కొంగున ఏవో మూట కట్టి తెచ్చాడు.

గవరన్న పద్దుపుస్తకంలో తాను ఆ రోజే నలభై గుమ్మడికాయలు తన తోటనుంచి కోసి సంతకు పట్టుకెళ్ళినట్టు పద్దున్నది.

"నీ పద్దుమాటేమిటి?" అని అధికారి పాపడి నడిగాడు.

పాపడు మూట విప్పి నలభై గుమ్మడి తొడిమలు తీసి, "అయ్యా, ఇదుగో నా పద్దు!" అన్నాడు. వాడు ఒక్కొక్క తొడిమే తీసి, ఒక్కొక్క గుమ్మడికాయకు తగిలించి, అన్ని తొడిమలూ అన్ని కాయలకూ ఎంత బాగా అతికాయో చూపాడు.

వెంటనే అధికారి గవరన్నచేత పాపడికి గుమ్మడికాయల డబ్బు ఇప్పించేశాడు. ఆనాటినుంచీ వాళ్ళ గ్రామంలో గవరన్నను అందరూ "గుమ్మడికాయల దొంగ" అని పిలవ సాగారు.



# పిన్నవాడి పెద్ద యోచన

పూర్వం హిందువులకూ, మహమ్మదీయులకూ నిత్యపోరుగా ఉండేది. ఆకాలంలో జహంగీరు మహారాష్ట్రులపైన దండెత్తాడు. అతడు ఒకనాడు తనవెంట, కుమారుడు షాజహానునుకూడా యుద్ధభూమికి తీసుకువెళ్ళాడు.

ముసల్మానులు విజయగర్వంతో మైమరచి నిద్రపోతున్నారు. కాని, పసివాడు షాజహానుకు మాత్రం నిద్రపట్టలేదు. 'నా సామర్థ్యంవల్ల నేనూ ఒక గొప్ప పనిలో జయం పొంది కీర్తి సంపాదించాలి!' అని వాని మనస్సులో తలపు కలిగింది.

వెంటనే గుర్రాన్ని ఎక్కి దౌడువదిలాడు. పోగాపోగా, ఒక చెట్టువద్ద చిత్రమైన శబ్దం వినిపించింది. పైకి చూశాడు. చిటారు కొమ్మమీద ఒక తేనెపట్టు కనిపించింది. పరిశీలించి చూడగా—పట్టులోపల వందలకొద్ది గదులు, గదుల్లో ఈగలు, అవన్నీ ఐక్యంగా ఉండి రాణియీగ ఆజ్ఞలప్రకారం నడుచుకోవటం—ఇదంతా ఆశ్చర్యం కల్గించింది.

మరునాడు అక్బరుపాదుషా తన మనుమడైన షాజహానును పిలిచి, 'నాయనా! యుద్ధం చూచి నీవు ఏమి నేర్చుకున్నావు?' అని అడిగాడు. అందుకు పిన్నవాడు 'తాతా! యుద్ధంలో విశేషమేముంది, చావులు తప్ప? అంతకంటె ఘనమైన విషయం తెలుసుకు వచ్చాను నేను' అంటూ, తేనెపట్టును గురించి తను చూచినదంతా వర్ణించి చెప్పాడు.

'తాతా, ఆ రాణియీగకు లోబడి పరివారం ఐక్యంగా పనిచేసినట్టుగా మన ప్రజ రాజాజ్ఞకు లోబడి ఐక్యంగా పనిచేస్తే ఎంత బాగుండును! దేశం శాంతంగా, సుఖంగా ఉండునుకదా!' అన్నాడు.

పసివాడి ఈ గొప్ప ఆలోచనకు తాతా, తండ్రీకూడా ఎంతో సంతోషించారు. ఆ పిన్నవాడైన షాజహానే పెద్దవాడై సింహాసనం ఎక్కిన తరువాత, ఈనాడుకూడా ప్రపంచ ఖ్యాతి పొందిన తాజ్‌మహల్‌ను నిర్మించాడు.

బి. ఎస్. విశ్వం

# నావికుడు సింద్‌బాద్

రోజులు సుఖంగా దొర్లిపోతున్నకొద్దీ నేను పడిన కష్టాలు మరిచిపోసాగాను. క్రమంగా నాకీ సుఖాల మీద ముఖంమొత్త నారంభించింది. తిరిగి అనుభవాలు సంపాదించాలన్న కోరికా, వర్తకం సాగించాలన్న కాంక్షా నాలో తలఎత్తాయి. దురాశ దుఃఖం చేటన్న మాట అబద్ధంకాదు. ఈ సంగతి నా విషయంలో త్వరలోనే ఋజువయింది. నేను ఖరీదైన సరుకులు కొని వాటితో బస్రా చేరాను. అక్కడ ఒక పెద్ద వర్తకపు ఓడ ప్రయాణానికి సిద్ధంగా ఉంది. అందులో స్నేహపాత్రులైన వర్తకులు అనేకమంది ఉన్నారు. వారు ఆపత్సమయంలో ఆదుకోగలవారు. వారితో కలిసి నేనుకూడా ఓడలో ప్రయాణమయాను. అల్లాను స్మరించి లంగరు ఎత్తించాము.

ఈ ప్రయాణంలో అన్నీ శుభశకునాలే అయాయి. మేము రేవు తాకిన చోటనల్లా లాభసాటిగా వర్తకం జరిగింది. మాకు ఎన్నో కొత్త విషయాలుకూడా తెలిశాయి. మా ఆనందానికి ఎలాటి విఘ్నమూ కలగలేదు.

మేము ముస్లిము దేశాలకు చాలా దూరాన నడిసముద్రంలో ఉన్నాం. ఆ సమయంలో ఒకనాడు

మూడవ సముద్రయానం

CHITRA

మా ఓడ సరంగు సముద్రం అంచును పరికిస్తున్నవాడల్లా అరిచేత్తో నుదురు కొట్టుకుని, గడ్డం పీక్కుని, చొక్కా చించుకుని, తలగుడ్డ విసిరి కింద కొట్టాడు.

అతని విషాద స్థితి చూసి ఆశ్చర్య పడుతూ అతన్ని చుట్టుముట్టి, "ఏమిటిది?" అని అడిగాం.

"అయ్యో, స్నేహితులారా! గాలి మనను మోసగించి రాగూడని సముద్రప్రాంతానికి తెచ్చింది. మన దురదృష్టంవల్ల మనం ఆ కనపడే దీవిని చేరబోతున్నాం. ఇక మనకు మూడినట్టే. ఎందుకంటే ఆ దీవిలో అడుగు పెట్టి ప్రాణాలతో బయటపడినవాడు ఇంత వరకు లేడు. అది మర్కటాల దీవి. మనం చచ్చినవారిలో జమే!" అంటూ సరంగు వాపోయాడు.

ఆయన ఇలా మాట్లాడుతూండగానే విచిత్రమైన జంతువులు, మిడతల దండు లాగా లుకలుకలాడుతూ, సముద్రంలో ఈదుకుంటూ వచ్చి మా ఓడను చుట్టుముట్టాయి. మరి కొన్ని తీరంలోనే ఉండి భయంకరమైన అరుపులు అరిచాయి. ఆ అరుపులకు రక్తం జిల్లుమని గడ్డ కట్టుకుపోయింది. మేమూ జంతువుల జోలికి పోలేదు. పోతే, అవి సంఖ్యా బలంచేత మమ్మల్ని తుదముట్టిస్తాయని భయం.






నిజానికి సంఖ్యాబలం ముందు శౌర్యసాహ సాలేం పనికవస్తాయి? ఈ మర్కటాలు ఓడ ఎక్కవచ్చి మా సరుకులను తడివి చూడసాగాయి.

ఈ జంతువులు నేను చూసిన వికార మైన జంతువులన్నిటికన్నా వికారంగా ఉన్నాయి. వాటి ఒంటి నిండా జూలున్నది. వాటి ముఖాలు నల్లగానూ, కళ్లు ఆకు పచ్చగానూ ఉన్నాయి. వాటి ఎత్తు మూడు జానలు మించదు. వాటి ముఖ వికారాలూ, అరుపులు మనం ఊహించలేనంత భయం కరమైనవి. అవి పళ్లు కొరుకుతూ, మష్షుల్ని తిడుతూ, మాతో మాట్లాడుతున్నట్టు స్పష్ట మయింది. కాని వాటి భాష మాకు తెలీదు. మేం అసహాయులమై అలా నిలబడివుండగా అవి తెరచాప స్తంభాలు ఎగబాకి, తమ దంతాలతో తాళ్ళు కొరికి, తెరచాపలను కింద పడేశాయి. తరవాత చుక్కాని వశ పరుచుకుని, అవి గాలివాలున పడవను తీరానికి నడిపాయి. తరవాత అవి మష్షుల్ని ఒకొక్కరినే పట్టుకుని తీరానికి చేర్చాయి. ఆ తరవాత అన్నీ కలిసి ఓడలో యెక్కి, సముద్రంమీదికి వెళ్ళి కనుచూపుమేర దాటి పోయాయి.

మేం కాస్తా దీవిలో చిక్కుపడిపోయాం. ఆ ఇసుక తీరంలో నిలబడి చేయగలది ఏముందిగనకా? అందుచేత దీవిలోకి బయలుదేరాం. అక్కడ మాకు పళ్ళ చెట్లూ, వాగులూ కనిపించాయి. ఈ చెట్ల పళ్ళు కోసుకుని తింటూండగా దూరాన మా కొక పెద్ద భవనం కనబడింది.

మేం దానికేసి వెళ్ళాం. అది నలుచద రంగా, ఎత్తుగా ఉన్న భవంతి. దాని చుట్టూ బలమైన ప్రహరీగోడ ఉన్నది. గోడ ద్వారానికి గల తలుపులు బార్లా తెరిచి ఉన్నాయి. అక్కడ రక్షకభటులు లెవరూ లేరు. అందుచేత మేం నేరుగా లోపలికి వెళ్ళాం. లోపల చాలా విశాలమైన హాలు

ఒకటి ఉన్నది. అందులో బ్రహ్మాండమైన వంట పాత్రలు, మాంసం గుచ్చి కాల్చే ఇనపకాడలూ ఉన్నాయి. నేలమీద ఎముకల పోగుల గుట్టలున్నాయి. వాటిలో కొన్ని ఎండిపోయీ, కొన్ని పచ్చిగానూ ఉన్నాయి. దుర్గంధానికి ముక్కులు పగిలిపోతున్నాయి. అయినా మేం డస్సిపోయి ఉండటంచేత అక్కడే పడుకుని నిద్రపోయాం.

సూర్యాస్తమయమైన కొద్దిసేపటికల్లా ఉరుములాంటి చప్పుడు విని మేం లేచి కూచున్నాం. ఒక భూతంలాటి కారునలుపు వాడు పైకప్పునుంచి దిగుతూ మాకు కనిపించాడు. వాడు తాటిచెట్టు ఎత్తున్నాడు, మర్కటాలన్నిటినీ మించి వికారంగా ఉన్నాడు. వాడి కళ్ళు నిప్పుల కుంపట్లలాగా ఎర్రగా వెలుగుతున్నాయి. వాడి పక్కపళ్ళు అడవిపంది కోరల్లాగా పొడవుగా వంపుతిరిగి ఉన్నాయి. వాడి కింది పెదవి రొమ్ముమీదికీ, వాడి చెవులు భుజాలమీదికీ వేళ్ళాడుతున్నాయి. వాడి చేతిగోళ్ళు సింహం గోళ్ళలాగా ఉన్నాయి.

మాకు భయంతో చెయ్యీ, కాలూ ఆడలేదు. ఆ రాక్షసుడు గోడవారనే ఉన్న ఒక బల్లమీద కూచుని మమ్మల్ని ఒక్కొక్కరినీ పరిశీలనగా చూశాడు. చివరకు వాడు మావద్దకు వచ్చి నన్ను మెడమీది చర్మం



పట్టుకుని, పిల్లికూనను ఎత్తినట్టు ఎత్తి, అటూ ఇటూ తిప్పిచూశాడు, నా తల తడివి చూశాడు. నేను వాడికి నచ్చినట్టు కనబడలేదు. నేనసలే బక్కపల్చని మనిషిని, ప్రయాణాలమూలంగా మరింత చిక్కి ఉన్నాను. వాడు నన్ను కింద పారేసి, నా పక్కవాణ్ణి అలాగే ఎత్తిచూసి, వాణ్ణికూడా కిందపారేసి, మరొకణ్ణి ఎత్తాడు. ఇలా అందరినీ పరీక్షించాక, చివరకు ఓడ సరంగు వంతు వచ్చింది.

మా సరంగు అజానుబాహువు, మంచి పుష్టి కలవాడు. అందుచేత ఆ రాక్షసుడు అతన్ని విరిచి చంపి, ఇనపకాడకు గుచ్చి, నిప్పుమీద కాల్చి నిశ్చింతగా తినేసి, బల్లమీద పడుకుని గురక పెడుతూ నిద్రపోయాడు. మా కెవరికీ ప్రాణాలలో ప్రాణాలు లేవు. ఆ రాక్షసుడు తెల్లవారి లేచి బయటికి వెళ్ళిపోయినదాకా మేము కుక్కిన పేలలాగా ఉండిపోయాం. ఆ తరవాత మా దుస్థితిని తలుచుకుని బావురుమని ఏడిచాం. ఏం చెయ్యాలో మాకు తోచలేదు. మమ్మల్ని ఆపేవారు లేరుగనక భవనం దాటి బయటికి వెళ్ళి దాక్కునేటందుకు చోటు దొరుకుతుందేమోనని చూశాం. కాని ఆ దీవిలో రహస్య ప్రదేశమన్నది కనిపించలేదు. ఈ రాక్షసుడి వాత



పడి చచ్చేకన్న సముద్రంలో పడి ఆత్మ హత్య చేసుకోవటం మేలని కొందరన్నారు. అంతదాకా వస్తే ఆ రాక్షసుణ్ణి చంపి చావటం మంచిదని మరి కొందరన్నారు. ఎట్లాగూ చావు తప్పేటట్టు లేదుగనక రాక్షసుణ్ణి చంపటానికే నిశ్చయించాం. ఆ తరవాత పారిపోవటానికి సాధనం ఉండాలి గనక, సముద్రతీరాన ఉన్న కొయ్యలతో ఒక తెప్ప తయారుచేసి పొద్దూకే సమయానికి భవనానికి తిరిగి వచ్చాం.

మామూలు వేళకు రాక్షసుడు రానే వచ్చాడు. వాడు మాలో మరొకణ్ణి చంపి తిని, బల్లమీద పడుకుని భూమి దద్దరిల్లేట్టు గురకపెట్టసాగాడు. చావగా మిగిలినవాళ్లం రెండు ఇనపకాడలు నిప్పుల్లో ఎర్రగా కాల్చి చెరొక కాడనూ ముగ్గురు నలుగురుచొప్పున మోసుకుని పోయి ఆ రాక్షసుడి రెండు కళ్ల లోనూ గుచ్చాం. వాడు బాధతో పెట్టిన అరుపులు వర్ణనాతీతమైనవి.

వాడి కళ్లయితే పోయాయిగాని వాడు చావలేదు. మాకోసం వాడు అంతటా తడవసాగాడు. కాని మేం వాణ్ణి సులువుగా తప్పించుకోగలిగాం. వాడు తడువుకుంటూ వాకిలి తెరుచుకుని బయటికి వెళ్లిపోయాడు. తప్పించుకుపోవటానికి అదే సమయమని సముద్రతీరానికి పరిగెత్తి, మేం తయారు చేసి ఉంచిన తెప్పమీద యెక్కి సముద్రం మీదికి తోసుకు పోసాగాం.

ఇంతలో పెడబొబ్బ ఒకటి వినిపించింది. కళ్ళులేని ఆ రాక్షసుణ్ణి, వాడికన్న వికార మైన ఒక ఆడ రాక్షసి నడిపిస్తున్నది. ఇద్దరూ కలిసి సముద్రతీరానికి వచ్చారు. వాళ్ళు మా తెప్పమీదికి పెద్ద పెద్ద బండ రాళ్ళు విసిరారు. వీటిలో కొన్ని గురిగా తగలటంవల్ల నేనూ, మరి ఇద్దరూ తప్ప మిగిలినవారంతా సముద్రంలో పడి పోయారు. మేము ముగ్గురమూ ఆ రాళ్ళ బారి దాటి పోగలిగాం. (ఇంకా వుంది)





# అర్చకుడి ఔదార్యం

ఒక గ్రామంలో ఒక అర్చకుడుండేవాడు. ఆయన చాలా మంచివాడు. రోగులకు చికిత్స చేసీ, తగాదాలు పరిష్కారం చేసీ, దుఃఖంలో వున్నవారిని ఓదార్చీ ఆయన గ్రామంలో అందరిచేతా యెంతో మంచివా డనిపించుకున్నాడు.

ఆయనా, ఆయన ముసలితల్లీ దేవాలయం పక్కనే చిన్న ఇంట్లో కాపరం చేస్తూండేవారు. ఆయనకు భార్యా, పిల్లలూ లేరు. గుడికింద వున్న రెండెకరాల మాన్యం మీద వచ్చేదానితోనే ఆయనకు జరిగిపోయేది. ఊళ్లోవాళ్లు ఎప్పుడైనా రూపాయో, అర్ధా చేతిలో పెడితే దాన్ని దాచివుంచుతూండేవాడు. ఆయన ఆ ఊరి గుడికి అర్చకుడుగా వచ్చి ఇరవై యేళ్లయింది. ఊళ్ళో పెద్దలందరూ ఆయనను గౌరవంతో చూసేవారు, చిన్నకారువాళ్ళు ఆయనను తండ్రిని చూసినట్టు చూసుకునేవారు.

ఆ గ్రామంలోనే కనకయ్య అని ఒక రైతుండేవాడు. ఆయన మొదట్లో అతి బీదవాడు. చిన్నతనంలోనే తండ్రి పోయాడు. అప్పటినుంచీ ఆయన కొంతకాలం పశువులను కాసీ, కొంతకాలం పాలేరుగా పనిచేసీ తనపొట్ట తాను పోసుకోవటమే గాక, అంతో ఇంతో వెనకవేశాడు. పొట్ట కట్టుకుని ఒక్కొక్క దమ్మిడీచొప్పున మిగుల్చుకున్న డబ్బు పెట్టుబడి చేసుకుని పాల వ్యాపారమూ, ధాన్యం వ్యాపారమూ సాగించి చూస్తుండగానే కనకయ్య ధనికుడయాడు. చిన్న మిద్దె కట్టాడు, పొలాలూ, అరటి, నారింజ తోటలూ కొన్నాడు.

గ్రామంలో ఆ కారువాళ్లలోకల్లా కనకయ్యే ఇంత కలవాడు. ఆయన సమర్థతను అందరూ మెచ్చుకునేవారే గాని, ఆయన పిసినిగొట్టుతనం మటుకు అందరికీ యేవగింపుగానే వుండేది.

ఎల్. పద్మనాభం





ఆమె భర్త పోయాడు. తల్లి కూతుళ్ళిద్దరూ చాకిరీ చేసుకుని జీవిస్తున్నారు.

కనకయ్య అక్క కాపరం కొంతలో కొంత బాగుంది. ఆమె భర్తకు కొద్దిగా పొలం వుంది. ఆయన కొంతకాలంక్రితం కనకయ్యకు వందరూపాయలు ఖరీదుచేసే పొలం ఒకటి అమ్మాడు. కనకయ్య ఆ బాకీ ఇంకా తీర్చలేదు. దాన్ని చెల్లుపేసే బదులు తన కొడుకు కట్నంకింద చెల్లుపెట్టి, అక్క కూతురు లక్ష్మిని గోవిందుడికి చేసుకుంటే సరిపోతుందని కనకయ్య నిశ్చయించుకున్నాడు.

ఇప్పటికీ ఆయన ప్రతి దమ్మిడీకూడా ఎంచి ఖర్చుపెడతాడు. వంటి నిండా బట్ట కట్టడు, కడుపునిండా తినడు. తన భార్యనూ, కొడుకునూ తిననివ్వడు.

కనకయ్యకు గోవిందుడు ఒక్కడే కొడుకు. వాడికి పెళ్లియీడు వచ్చింది. కనకయ్యకు ఇద్దరు తోబుట్టువు లున్నారు, ఒక అక్కా, ఒక చెల్లెలూ. ఇద్దరికీ పెళ్ళియీడు వచ్చిన ఆడపిల్లలున్నారు. వారిలో కనకయ్య చెల్లెలు కూతురు, కమల చక్కని చుక్క, ఎంతో బుద్ధిమంతురాలు. గోవిందుడికి కమలనే పెళ్ళాడాలని వుద్దేశం. కాని కమల తల్లి చాలా దీనస్థితిలో వున్నది.

తనకు లక్ష్మిని ఇచ్చి తండ్రి పెళ్లిచేద్దామనుకుంటున్నాడని తెలియగానే, గోవిందుడు దేవాలయంవేపు వెళ్లి అర్చకుడితో అంతా చెప్పుకున్నాడు.

"ఈ భాగ్యానికి విచారం దేనికి? మీ నాన్నతో స్పష్టంగా చెప్పెయ్యి—కమలను తప్ప పెళ్ళాడనను!" అన్నాడు అర్చకుడు.

"అంటే నన్ను ఇంట్లోనుంచి పొమ్మంటాడు. ఆయన డబ్బుదగ్గిర చాలా నీచుడు. చూస్తూ చూస్తూ వందరూపాయలు వదులుకుంటాడా? మా చిన్నత్త తోలీ కట్నంకూడా ఇవ్వలేదు. అందుచేత మా నాన్న దృష్టిలో ఆవిడా, ఆవిడ కూతురూ మనుషులే కారు.



ఇంతకూ నాకు కమలను పెళ్ళాడే గీత లేదు!" అన్నాడు గోవిందుడు.

"మీ అమ్మతో చెప్పిచూడు. ఆవిడవల్ల కూడా కాకపోతే ఆలోచిద్దాం," అన్నాడు అర్చకుడు. గోవిందుడు నిరుత్సాహంతో వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం పూజ అయాక అర్చకుడు మండపంలో కూచునివుండగా చీకటిలో ఎవరో మెల్లెక్కి గుడిలోకి పోతూ కనిపించారు.

అర్చకుడు మండపం దిగి గుడిలోకి వెళ్ళి చూసేసరికి దేవుడి కెదురుగా కమల మోకరించి కూర్చుని ప్రార్థిస్తూ వుండటం కనిపించింది. ఆమె చెక్కిళ్ళ మీదుగా కన్నీరు కారుతూండటం చూసి అర్చకుడికి కడుపులో చెయ్యిపెట్టి కెలికినట్టయింది.

కమల గుడినుంచి బయటికి వెళ్ళిపోయాక చాలాసేపు దీర్ఘంగా ఆలోచించి అర్చకుడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు.

మర్నాడు తెల్లవారుజామునే లేచి అర్చకుడు తనవద్ద పోగయిన డబ్బంతా తీసి లెక్కచూశాడు. అందులో కొద్దిగామాత్రమే అట్టేపెట్టుకుని మిగిలిన దంతా తీసుకుని బస్తీకి బయలుదేరాడు. అక్కడ ఒక పెద్ద



కమసాలివద్ద తాను తెచ్చిన డబ్బుతో యాభై బంగారు కాసులు కొని తన గ్రామానికి తిరిగి వచ్చాడు.

అర్చకుడు తన ఇంటికి రావటం చూసి కనకయ్య ఆశ్చర్యపోతూ, "దయచెయ్యండి! ఊరికే రారు పెద్దలు!" అన్నాడు.

"ఒక చిన్న సలహా కోరి వచ్చాను. ఇవాళే ఒక దాత నా చేతికి యాభై కాసులిచ్చి, వాటిని యోగ్యురాలైన పేదపిల్లకు, పెళ్లియాడుదానికి యెవరికైనా భరణంగా ఇవ్వమని కోరాడు. పాపం, ఆయనకు ఆడపిల్లలు లేరట. ఏ పిల్లా పీచు లేనివాణ్ణి నేను మాత్రం ఎవరికివ్వాలో ఎలా తేల్చను?

ఆడపిల్లలు కలవాళ్లని సలహా అడగటం భావ్యంగా ఉండదుగదా? నువు పెద్దవాడవు, కష్టసుఖా లెరిగినవాడవు. అందుచేత నిన్ను సలహా అడుగుదామని వచ్చాను," అన్నాడు అర్చకుడు.

కనకయ్య ఆలోచించినట్టు నటించి కొన్ని పేర్లు చెప్పాడు. అందులో కొందరు పెళ్ళి అయినవాళ్ళు, కొందరు డబ్బు గల వాళ్ళు, కొందరి ప్రవర్తన మంచిదికాదు. అన్ని పేర్లకూ కాదన్నట్టు అర్చకుడు తల అడ్డంగా తిప్పాడు.

"అన్నట్టు మా అక్క కూతురు లక్ష్మి వుంది. వాళ్లు ఏమంత కలవాళ్ళు కారు. అది పెళ్లి కావలిసిన పిల్ల, బుద్ధిమంతు రాలు!" అన్నాడు కనకయ్య.

"అంతదాకా వస్తే లక్ష్మి కివ్వటంకంటె కమల కివ్వటం ఇంకా మంచిదికదా! పాపం, ఆ తల్లి కూతుళ్లు పూట గడవక నానా ఇబ్బందీ పడుతున్నారు. నాకు చూడగా కమలకే ఇద్దామనిపిస్తున్నది. అలాగే చేద్దాం. రేపో ఎల్లుండో మీ చెల్లెలితో చెప్పేస్తాను. అంతదాకా ఈ కాసులు నీ దగ్గిరే దాచి వుంచు. నా కేమన్నా భోషాణాలా, ఇనప్పెట్టెలా?" అంటూ అర్చకుడు మూట విప్పి యాభై కొత్త కాసులూ ఘల్లున కనకయ్య ముందు పోసేశాడు.





వాటిని చూడగానే కనకయ్య కళ్ళు జిగేలుమన్నాయి. ఆయన వాటిని యెంతో భక్తితో తన ఇనప్పెట్టెలో పెట్టి తాళంవేసి, తాళంచెవి రొండిన పెట్టుకున్నాడు. ఆ రోజల్లా కనకయ్యకు ఆ కాసులు కళ్ల ఎదట మెదులుతూనే వున్నాయి. రేపో యెల్లుండో వాటిని అర్చకుడు తీసుకుపోతే తన ఇనప్పెట్టె చిన్నబోతుందని కనకయ్యకు అనిపించింది.

ఆ సాయంకాలం గోవిందుడు మళ్ళీ అర్చకుడివద్దకు వచ్చాడు.

"మీ నాన్నతో కమలను తప్ప చేసుకోనని చెప్పావా?" అన్నాడు అర్చకుడు.

"లేదు. చెప్పి లాభం లేదు. మా అమ్మతో చెబితే ఆవిడకూడా ఆ మాటే అన్నది. కమలకు నిన్నటినుంచీ నిద్రాహారాలు లేవుట," అన్నాడు గోవిందుడు.

అర్చకుడు తనలో తాను నవ్వుకుని, పైకిమాత్రం కోపం వచ్చినట్లు నటిస్తూ, "పాపిష్టివాడా, నిష్కారణంగా కమలను చంపుకుంటావా? వెంటనే వెళ్లి మీ నాన్నను అడుగు. నీ మాట యెందుకు కాదంటాడో నేను చూస్తాను," అన్నాడు.

అర్చకుడీ మాట అనేసరికి గోవిందుడికి సాహసం వచ్చింది. వెంటనే వాడు ఇంటికి వెళ్ళి తన తండ్రితో, "నాన్నా, నేను లక్ష్మిని

చేసుకోను. చేస్తే నాకు కమలనే ఇచ్చి చెయ్యి. లేకపోతే అసలు నాకు పెళ్ళే వద్దు!' అన్నాడు.

కనకయ్య తన కొడుకీ మాట అనటం విని మొదట నిర్ఘాంత పోయాడు. కాని కొంచెం ఆలోచించిన మీదట ఆయనకు ఇదీ మంచికే వచ్చిందనిపించింది. ఏమంటే, అర్చకుడు ఆ యాభై కాసులూ కమలకు ఇస్తానన్నప్పటినుంచీ కనకయ్యకు మనసు మనసులో లేదు. వాటిని ఎట్లాగైనా లక్ష్మికి ఇప్పించేటట్టు చెయ్యటం ఎలాగా అని ఎంతో తల పగలగొట్టుకున్నాడు. ఎప్పుడైతే గోవిందుడు కమలనే పెళ్ళాడతా నన్నాడో, కనకయ్య నెత్తిమీది బరువంతా దించేసి నట్టు అయిపోయింది. ఇంతకూ తనకు ఆ కాసులు దక్కవలిసి వుంది. అందు చేతనే, ఎన్నడూ కమల ఊసు ఎత్తని గోవిందుడు అకస్మాత్తుగా దాన్ని పెళ్ళాడతా నని పట్టుబట్టాడని కనకయ్య అనుకున్నాడు.

"సరేరా, నీ యిష్టం! నువ్వంతగా కమలనే చేసుకుంటానంటే నేనెందుకు కాదంటానూ?" అని కనకయ్య గోవిందుడితో అన్నాడు. ఆయన ఆ రోజే తన చెల్లెలిని పిలిచి, కమలకూ, గోవిందుడికీ పెళ్ళి ఏర్పాటు చేస్తున్నానని చెప్పాడు.

ఈ సంగతి తెలియగానే కనకయ్య అక్క మొగుడు వచ్చి, "నీ కొడుక్కు మా లక్ష్మిని చేసుకుంటా నంటివిగద? అన్న మాట తప్పుతావా?" అని అడిగాడు.

"నన్నేం చెయ్యమంటావు? నాకు లక్ష్మి ఒకటీ, కమల ఒకటీనా? గోవిందుడు కమలనే చేసుకుంటానని పట్టుబట్టి కూచున్నాడు," అన్నాడు కనకయ్య.

కొద్ది రోజులకే కమలకూ, గోవిందుడికీ పెళ్ళి జరిగిపోయింది. అర్చకుడు యాభై కాసులూ కమలకు చదివించాడు. కాని ఆయన కమల పెళ్ళికి ఎలా తోడ్పడ్డాడో గ్రామంలో యెవరికీ తెలియదు.



# మూర్ఖ సన్యాసి

ఒక మూర్ఖుడుండేవాడు. వాణ్ణి ఎవరూ గౌరవించలేదు. అందుకని వాడు సన్యాసం పుచ్చుకున్నాడు. అప్పటికీ వాణ్ణి ఎరిగున్నవాళ్ళు చాలా మంది గౌరవించలేదు.

ఒకరోజు ఆ సన్యాసి ఒక వీధివెంట పోతూవుండగా ఒక గొర్రెపొటేలు ఎదురయింది. అది సన్యాసిని చూసి వెనక్కు వెనక్కు పోసాగించి.

"నా గొప్పతనం ఈ గొర్రెపొటేలు కనిపెట్టేసిందిగదా!" అనుకుని, మూర్ఖసన్యాసి పరమానందం చెంది, వెంటనే చెయ్యి ఎత్తి దాన్ని ఆశీర్వదించటానికి ముందుకు నడిచాడు.

ఆ సమయంలో దారివెంట పొయ్యే మనిషి ఒకడు, "ఆ పొటేలును నమ్మకండి, స్వామీ! అది మహా చెడ్డది!" అని హెచ్చరించాడు.

సన్యాసి ఆ మాటలు నమ్మక పొటేలును సమీపించాడు. కొంత దూరం వెనక్కు వెళ్ళిన పొటేలు ఆకస్మికంగా ముందుకు పరిగెత్తుకువచ్చి మూర్ఖ సన్యాసిని ఒక్క కుమ్ము కుమ్మి పడగొట్టేసింది.






## 2

[ట్రోయ్‌నగరపు రాజైన వర్ధనుడికి, మోహనుడనే కుమారుడు కలిగాడు. వాడివల్ల నగరానికి అరిష్టం కలుగుతుందని వర్ధనుడు వాణ్ణి చంపవలసిందిగా తన పసులకాపరిని ఆజ్ఞాపించాడు. కాని పసులకాపరి మోహనుణ్ణి చంపక, పెంచి పెద్దవాణ్ణి చేశాడు. ఒక నాడు ముగ్గురు దేవతా స్త్రీలు తమలో గొప్ప అందగత్తెను నిర్ణయించమని వచ్చారు. భువనసుందరిని తనకిప్పిస్తానన్న కామినీ దేవతను మోహనుడు నిర్ణయించాడు.]

తన కుమారుణ్ణి పసులకాపరి కిచ్చి చంపి వెయ్యమని ఉత్తరువిచ్చినది మొదలు వర్ధనుడు ఏటా ఆ చనిపోయిన కుమారుడి స్మారకార్థం ట్రోయ్‌నగరంలో ఉత్సవాలు జరుపుతున్నాడు.

మోహనుడు కామినికి ఫలం ఇచ్చిన కొద్దిరోజులకే ఈ ఉత్సవాల తరుణం వచ్చింది. వర్ధనుడి భటులు ఐడా పర్వతానికి వచ్చి, ఉత్సవాలలో జరిగే పోటీ ప్రదర్శనలలో పాల్గొనటానికిగాను మంచి పందెపు ఎద్దును ఏరి ఇవ్వవలసిందిగా పసులకాపరిని కోరారు.

ఈ ఉత్సవాలను మోహను డెన్నడూ చూసివుండలేదు. ముఖ్యంగా పోటీపందాలు చూడాలని అతనికి గాఢమైన కోరిక కలిగింది. ట్రోయ్ నగరానికి వెళ్ళితీరాలని అతడు పట్టుపట్టాడు.

అందువల్ల ఏం ప్రమాదం మూడుతుందోననీ, వర్ధనుడి కుమారుణ్ణి తాను చంపటానికి బదులు పెంచి పెద్దవాణ్ణి







చేసిన సంగతి బయటపడిపోతుందేమోననీ పసులకాపరి భయపడ్డాడు. ఎంత చెప్పినా మోహనుడు వెళ్ళితీరాలని మంకుపట్టు పట్టాడు. అతన్ని ఒంటరిగా పంపటం ఇష్టం లేక, పసులకాపరి తానుకూడా మోహనుడి వెంట బయలుదేరాడు.

ట్రోయ్‌నగరంలో ఏటా జరిగే స్మారకోత్సవాలలో అనేక పోటీలుంటాయి. అందులో మల్లయుద్ధం ఒకటి. వర్ధనుడి సింహాసనాని కెదురుగా అనేకమంది మల్లులు యుద్ధాలు చేస్తారు. అందులో ఎవరైనా పాల్గొనవచ్చు. అందరినీ ఓడించిన మల్లుడికి "మకుటం" ఇస్తారు.

పసులకాపరి ఎంత వద్దంటున్నా వినక మోహనుడు ఈ మల్లయుద్ధాలలో జొరబడి, అందరినీ ఓడించి మకుటం సంపాదించాడు. తరవాత అతను పరుగు పందాలలో పోటీ చేసి, అందరినీ ఓడించి ఇంకొక మకుటం సంపాదించాడు. మోహనుడు ఎప్పుడైతే వరసగా రెండు మకుటాలు సంపాదించాడో, అప్పుడే వర్ధనుడి కొడుకులకు కన్ను కుట్టింది. ఊరూ పేరూ లేని మోహనుణ్ణి అణచివెయ్యాలనే ఉద్దేశంతో వారు అతన్ని తమతో కుస్తీకి రమ్మని పిలిచారు. ఆ కుస్తీలో కూడా మోహనుడు అందరినీ ఓడించి మూడో మకుటం సంపాదించాడు!



ఇంతదాకా వచ్చాక మోహనుణ్ణి చంపెయ్యటానికి వర్ధనుడి కుమారులు నిశ్చయించారు. మోహనుడు క్రీడారంగం నుంచి పారిపోకుండా తమ భటులను కాపుండమని హెచ్చరిక చేసి, వీరసింహుడు, అరిభయంకరుడు అనే వారిద్దరు కత్తులు దూసి మోహనుడిపైకి ఉరికారు. చిత్రమేమిటంటే, అరిభయంకరుడూ, మోహనుడూ ఒక తండ్రి బిడ్డలే గాక, ఒక తల్లి బిడ్డలుకూడానూ; అయితే ఆ సంగతి ఆ ఇద్దరికీ తెలియదు.

వ్యవహారం శ్రుతి మించిందని గ్రహించి, పసులకాపరి వర్ధనుడివద్దకు పరిగెత్తి వెళ్ళి, "మహారాజా! మోహనుణ్ణి కాపాడండి! అతను మీ కుమారుడే!" అని చెప్పేశాడు.

రాజుకు తన కుమారుడు చావలేదని తెలిసి విచారం కలగలేదు. తన అజ్ఞను ఉల్లంఘించినందుకు పసులకాపరిపైన ఆయన ఆగ్రహించనూలేదు. తన కుమారుడు బతికే వున్నాడన్న సంతోషానికి, అతనింత ప్రయోజకుడయాడన్నంత సంతోషం కూడా తోడై ఆయన ఆనందపారవశ్యంలో తేలిపోయాడు.

తన కుమారుడు తనను చేరుకున్నందుకాయన బ్రహ్మాండమైన విందులు జరపమని ఉత్తరువిచ్చాడు. దేవతలందరికీ



బలు లివ్వమన్నాడు. మోహనుణ్ణి చూసి గర్వించినంతగా ఆయన తన ఏ కొడుకును చూసీ గర్వించి వుండలేదు.

పూజారులు వర్ధనుణ్ణి హెచ్చరించారు: "మహారాజా, మోహనుణ్ణి తక్షణం వధించండి! లేకపోతే ట్రోయ్‌నగరం దగ్ధమై పోతుంది!" అన్నారు.

"ఇంత ప్రయోజకుడైన కొడుకును పోగొట్టుకునేకంటె, ట్రోయ్‌నగరం దగ్ధమై పోవటమే నాకు సమ్మతం!" అన్నాడు వర్ధనుడు గర్వంగా.

ఇప్పుడు మోహనుడు వర్ధనుడి కుమారులలో ఒకడు. అతని సోదరులందరికీ అదివరకే వివాహాలు జరిగాయి. వారు భార్యలతో కాపరాలు చేస్తున్నారు.

"నీవుకూడా పెళ్ళాడరాదురా?" అని వాళ్ళు మోహనుణ్ణి అడిగారు.

మోహనుడు నిత్యమూ కామినీ దేవతకు పూజ చేస్తూండేవాడు. "నాకు తగిన భార్యను ఈ దేవి నాకు సమకూరుస్తుంది. నేను భార్యకోసం వెతకనవసరం లేదు!" అని అతను అన్నలకు జవాబిచ్చాడు.

అయితే, తనకు కావలిసిన భువనసుందరి స్పార్టాలో ఉన్నదని అతనికి తెలుసును. స్పార్టాకు వెళ్ళటానికి ఏ వంక దొరుకుతుందా అని అతను ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. అటువంటి అవకాశం అతనికి త్వరలోనే దొరికింది.

వర్ధనుడికి సులోచన అని ఒక చెల్లెలుండేది. ఆమెను కొంతకాలం క్రితం గ్రీసుదేశస్థులు ఎత్తుకుపోయారు. ఇది జరిగిన అనంతరం వర్ధనుడు సదస్సు జరిపి, గ్రీసుపై దండెత్తటమా, లేక శాంతియుతంగా సులోచనను విడిపించి తెచ్చుకోవటమా, నిర్ణయించమన్నాడు. సదస్సులో శాంతిమార్గమే మంచిదని నిర్ణయం జరిగింది. ట్రోయ్‌నుంచి దూతలు గ్రీసుకు వెళ్ళి సులోచనను మర్యాదగా వప్పగించ





మన్నారు. కాని గ్రీసుదేశస్థులు ఇందుకు సమ్మతించలేదు. రాయబారం విఫలమయింది.

దీని ఫలితంగా మళ్ళీ సదస్సు ఏర్పాటయింది. ఈసారి, యుద్ధం జరగాలనీ, గ్రీసుపైకి దండెత్తి వెళ్ళాలనీ నిర్ణయం జరిగింది.

"ఈ దాడిని నేనే నిర్వహిస్తాను. నాకు తగినన్ని నౌకలూ, బలాలూ ఇప్పించండి. నేను సులోచనను తీసుకువస్తాను. అథవా తీసుకురాలేని పక్షంలో, సులోచనకు సాటి వచ్చే మరొక గ్రీకు రాజకుమారినైనా ఎత్తుకు వస్తాను!" అని మోహనుడు తన తండ్రితో అన్నాడు.

ఇది జరిగిన నాడే, భువనసుందరి భర్త అయిన ప్రతాపుడు స్పార్టానుండి ట్రోయ్‌కి వచ్చాడు. అయన రాకకు కారణమేమంటే ఆకస్మికంగా స్పార్టానగరంలో మహామారి చెలరేగింది. ట్రోయ్ నగరంలో ఉండే కొందరు దేవతలకు బలులిచ్చి మహామారిని శాంతింపజేసే ఉద్దేశంతో ప్రతాపుడు ప్రయాణమై వచ్చాడు.

మోహనుడు ప్రతాపుణ్ణి చాలా ఆదరంతో చూసి, ఆయనతో స్నేహం చేసుకున్నాడు. "నేనుకూడా మీ స్పార్టాకు వచ్చి, అక్కడి దేవతల నారాధించి, పుణ్యం సంపాదించుకునే సన్నాహంలోనే ఉన్నాను!" అని మోహనుడు ప్రతాపుడితో అన్నాడు. ఈ మాట విని ప్రతాపుడు సంతోషించాడు.

త్వరలోనే, మోహనుడు కోరిన ప్రకారం నౌకలు సిద్ధం చేయబడ్డాయి. వాటిలో మోహనుడి వెంట ప్రతాపుడు కూడా బయలుదేరాడు. కాలక్రమాన వారు స్పార్టా చేరుకున్నారు.

భువనసుందరి కోసం మోహనుడు అంతులేని కానుకలు తెచ్చాడు. వాటి నన్నిటినీ అతను ఆమెకిచ్చి, వారింటనే అతిథిగా ఉండిపోయాడు.









భువనసుందరిని మించిన సుందరి ప్రపంచంలో మరి వుండదని, ఆమెను చూడగానే మోహనుడికి తెలిసిపోయింది. కామినీదేవత అనుగ్రహంతో ఆమెను ఎప్పుడు తనవెంట ట్రోయ్‌నగరానికి తీసుకుపోదామా అని అతను ఆత్రపడసాగాడు.

కామినీదేవత ప్రోద్బలంచేత భువన సుందరికికూడా మోహనుణ్ణి చూసినది మొదలు అతనిపైన అంతులేని ప్రేమ పుట్టుకు వచ్చింది. కాని ఆమె దానిని తన భర్తకు తెలియకుండా దాచగలిగింది. మోహనుడు మాత్రం తన కోరికను ఏమాత్రమూ దాచలేకపోయాడు. అతని

అభిప్రాయం తన భర్త అయిన ప్రతాపుడు ఎక్కడ తెలుసుకునిపోతాడోనని భువన సుందరి చాలా భయపడింది.

మోహనుడు స్పార్టానగరంలో తొమ్మిది రోజులు ప్రతాపుడి అతిథిగా వున్నాడు. ఈలోపుగానే ప్రతాపుడి తాతగారు చని పోవటమూ, ఆయన దినవారాలకుగాను ప్రతాపుడు క్రీట్ దీవికి వెళ్లవలిసి రావటమూ జరిగింది.

ఇదంతా కామినీదేవత చలవే నను కున్నాడు మోహనుడు. తనవెంట రావటానికి భువనసుందరిని అతను సులువుగా ఒప్పించాడు.

ఆ రాత్రే వారిద్దరూ రహస్యంగా మోహనుడి ఓడలోకి చేరారు. ఓడలన్నీ ట్రోయ్‌నగరానికి బయలుదేరాయి. మోహనుడు తిరుగు దారిలో అనేక దీవులలో మజిలీలు చేస్తూ చాలా కాలానికిగాని ట్రోయ్‌కి చేరుకోలేదు.

అక్కడ ప్రతాపుడు తన తాతగారి దిన వారాలు పూర్తి చేసుకుని ఇంటికి తిరిగి వచ్చి, మోహనుడు అతిథిగా వచ్చి ఎంత మోసం చేశాడో తెలుసుకున్నాడు. వెంటనే ఆయన తన అన్నగారైన రారాజువద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, "ట్రోయ్‌మీద

యుద్ధానికి సన్నాహాలు జరిపించండి!" అని ఆవేశంతో అడిగాడు.

"నువు తొందరపడకు. నేను ట్రోయ్‌కి దూతలను పంపి, నీ భార్యనూ, నీకు జరిగిన అపచారానికి తగు పరిహారాన్నీ తెప్పిస్తాను. వాళ్ళు మంచిమాటలతో లొంగిరాని పక్షంలో యుద్ధం వుండనే వున్నది!" అన్నాడు రారాజు.

రారాజు పంపిన దూతలు ట్రోయ్‌నగరం చేరేసరికి, మోహనుడు భువనసుందరితో ఇంకా తిరిగి రాలేదు. అందుచేత దూతలు తన కుమారుడిపై చేసిన ఆరోపణలను వర్ధనుడు ఎంతమాత్రమూ నమ్మలేదు.

"మీరు చెప్పేది ఒకటీ నేనెరగను. ఒక వేళ నా కొడుకు మీ రాజకుమారిని ఎత్తుకుపోయాడే అనుకున్నా, మీకు పరిహారం ఇవ్వవలిసిన అవసరం నా కేమీ కనిపించటం లేదు. నా చెల్లెలు సులోచనను ఎత్తుకుపోయిన గ్రీకులు నాకేమి పరిహారం ఇచ్చారు?" అని వర్ధనుడు దూతలను గద్దించి అడిగాడు.

ఈ విధంగా శాంతిదూతలను తిప్పి పంపినందుకు వర్ధనుడు తరవాత ఏమాత్రమూ చింతించలేదు. ఎందుచేతనంటే, మోహనుడు భువనసుందరితో వచ్చి చేరగానే, వర్ధనుడు ఆమె సౌందర్యం చూసి ఎంతో ముచ్చటపడ్డాడు. మోహనుడే కాదు, వర్ధనుడే కాదు, భువనసుందరివంటి అపురూప సౌందర్యవతి ట్రోయ్ నగరానికి వచ్చినందుకు పరమానందం చెందనివారు ఆ నగరంలో ఒక్కరుకూడా లేరు.

మోహనుడికీ భువనసుందరికీ అత్యంత వైభవంగా వివాహం జరిగింది.

"గ్రీకులు వెయ్యేళ్లు తలకిందుగా తపస్సు చేసేదిగాక, నేను భువనసుందరిని వారికి వప్పగించను!" అని వర్ధనుడు బహిరంగంగా ప్రమాణంచేశాడు.

(ఇంకా ఉంది)






# బాగుపడిన వాడు

పూర్వం ఒక నగరంలో ధనికుడైన వర్తకు డుండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు. వారు ముగ్గురూ చదువు పూర్తి చేసినాక తండ్రి వారిని పిలిచి, ఒక్కొక్కరినీ, "నాయనా, బతుకుతెరువుకు నువ్వేం చెయ్యదలుచుకున్నావు?" అని అడిగాడు.

పెద్దకొడుకు తండ్రితో, "నాన్నా, నాకు వైద్యం చెయ్యాలని వుంది. తగినంత డబ్బిస్తే నేను వైద్యశాస్త్రం చదువుకుని, మందులు తయారుచేసుకుని, రోగులకు చికిత్స చేస్తూ, నాదారిన నేను బతుకుతాను," అన్నాడు. తండ్రి సరేనని వాడికి కొంత డబ్బిచ్చాడు.

రెండవ కొడుకు తండ్రితో, "నాన్నా, నేను నీలాగే వర్తకం చేసి డబ్బు సంపాదించుకుంటాను. నాకు కావలిసిన మూలధనం ఇయ్యి!" అన్నాడు. ఆప్రకారమే తండ్రి వాడికి అవసరమైన ధనం ఇచ్చాడు.

మూడవ కొడుకు చంద్రకాంతుడు మాత్రం తాను ఏమి చెయ్యదలుచుకున్నదీ వెంటనే చెప్పలేదు. తండ్రి గుచ్చి అడిగిన మీదట వాడు, "నాన్నా, నాకు దొంగ కావాలని వున్నది," అన్నాడు.

వాడి తండ్రీ, అన్నలూ ఈ మాటలు విని మొదట ఆశ్చర్యపడ్డారు, తరవాత వారికి కోపం వచ్చింది.

"నీకేం గతి పట్టింది? దొంగ కావటమేమిటి? అటువంటి పిచ్చి ఆలోచనలు మాని ఏదైనా పరువైన వృత్తి చూసుకో!" అని తండ్రి తన మూడవ కొడుకును మందలించాడు.

కాని వాడి బుద్ధి మారలేదు. "ఈ ప్రపంచంలో దొంగలకే పరువు మర్యాదలు! నేను దొంగనే అవుతాను!" అని వాడు మంకు పట్టు పట్టాడు. అన్నలు ఎన్ని విధాల చెప్పినా ఏమీ లాభం లేక పోయింది.

ఆర్. రామానుజాచారి







గుమాస్తా అయిదువేల వరహాలు ఇచ్చేశాడు. వర్తకుడి మూడవ కొడుకు చంద్రకాంతుడు ఆ సొమ్ముతోసహా ఆ రాత్రే బయలుదేరి ఎటో వెళ్లిపోయాడు.

అనేక సంవత్సరాలు గడిచాయి. వర్తకుడు ముసలివాడయిపోయాడు. ఆయనకు పోటీదార్లు చాలామంది బయలుదేరి, అందరూ ఏకమై ఆయన వర్తకాన్ని పడగొట్టారు. అధికారులకు లంచాలు పెట్టి, ఆయన సరుకులు సకాలంలో యెగుమతి కాకుండా, దిగుమతి కాకుండా చూశారు. అవసరానికి ఆయనకు అప్పు పుట్టకుండా చేశారు. ఆయనకు బాకీలున్నవాళ్లు ఆ బాకీలు తీర్చలేదు. క్రమంగా ఆయన పేద స్థితిలోకి వచ్చి, కొడుకులు పోషించవలసిన అవసరం ఏర్పడింది.

"అలా అయితే నువు నా ఇంటో వుండనవసరం లేదు. నీకు చిల్లిగవ్వ కూడా ఇవ్వను. నువు దొంగాతనాలు చేసి, పట్టుపడి, ఆ తరువాత నీకు శిక్షపడితే నేనుగాని, నీ అన్నలుగాని రక్షిస్తామని ఆశపెట్టుకోకు. నీ దారి నువు చూసుకో!" అని వర్తకుడు తన మూడవ కొడుకుతో ఖచ్చితంగా చెప్పేశాడు.

ఈ సంగతి యెవరికీ తెలియక మునుపే చంద్రకాంతుడు తన తండ్రి గుమాస్తా వద్దకు పోయి, "అవసరంగా కావాలి, అయిదువేల వరహాలు చేబదులియ్యి," అని అడిగాడు.

పోనీ ఆ కొడుకులైనా బాగుపడ్డారా అంటే అదీ లేదు. పెద్దకొడుకు వైద్యం నేర్చుకుని ఒక పెద్ద నగరంలో వైద్యం ఆరంభించాడు. ఆ నగరంలో అదివరకు వుంటున్న వైద్యులు ఈ కొత్తవాణ్ణి ఏవిధంగానైనా సాగనంపాలని నిశ్చయించారు. వాళ్లు అతని పరిచయం చేసుకుని, "నీకేమీ ఫరవాలేదు. కొత్తవాడి పని నీదగ్గిరికి యెవరూ రాకపోవచ్చు. మాదగ్గిరికి వచ్చే రోగులలో ధనికులను





నీవద్దకు పంపుతాం. కాస్త పేరు ప్రతిష్ఠలు వచ్చాక నీకెవరి సహాయమూ అవసరం ఉండదు!'' అని తియ్యగా మాటలుచెప్పారు. వాళ్ళే చాటుగా, ''ఈ కొత్త వైద్యుడికి ఏమీ రాదు. వున్న వూళ్ళో తన ఎత్తు పారదని ఈ కొత్త ఊరు వచ్చాడు. వీడి చేతిలో పడ్డ రోగి బతికి బయటపడ్డదాకా నమ్మకం లేదు!'' అంటూ ప్రచారం చేశారు.

తమ రోగులలో చావటానికి సిద్ధంగా వున్నవారిని వాళ్లు వర్తకుడి కొడుకుకు వప్పగించారు.

అన్ని రోగాలకూ మందు లుండవు. ఆ రోగులు ఈ కొత్త వైద్యుడి చేతిమీదుగా చనిపోయారు. ఈ విధంగా ముగ్గురు నలుగురు చనిపోయాక, ఆ వైద్యులే వర్తకుడి కొడుకు దగ్గిరికి వచ్చి, ''నీ చేతిలో పోయిన రోగులు పలుకుబడి గలవాళ్ళు. పెద్ద మంత్రిగారు నిన్ను విచారణ చేసి శిక్షించటానికి ఆలోచిస్తున్నట్టు తెలిసింది. జాగ్రత్త!'' అని హెచ్చరించారు.

వర్తకుడి పెద్దకొడుకు బెదరిపోయాడు. అతనికి వైద్యమంటే భయమూ, అసహ్యమూ పుట్టింది. అతను ఆ రాత్రే తన భార్యతోనూ, పిల్లలతోనూ బయలుదేరి తండ్రిదగ్గిరికి వెళ్ళిపోయాడు.

వర్తకుడి రెండవ కొడుకు సంగతికూడా అంతే అయింది. అతని తండ్రి వర్తకం పాడయిపోయిన కారణంగా, వాడికి ఎవరూ అప్పు ఇవ్వలేదు. వాడు వర్తకం కట్టిపెట్టి, దుకాణం పెట్టుకుని వ్యాపారం ప్రారంభించాడు. కాని అదికూడా ఎక్కలేదు. వ్యాపారంలోకూడా దెబ్బతిని వాడు తండ్రి వద్దకు చేరుకున్నాడు.

చంద్రకాంతుణ్ణిగురించి మటుకు వార్తే లేదు. వాడు ఏనాడో ఖైదులో పడివుంటాడనీ, వాణ్ణి కొరతవేసి వుంటారనీ వాడి అన్నలు అనుకున్నారు. కాని వారి ఊహలు తప్పయాయి.





తన తండ్రి గుమాస్తాదగ్గిర అయిదు వేల వరహాలూ తీసుకుని బయలుదేరిన చంద్రకాంతుడు కొద్దిరోజులు ప్రయాణం చేసి ఒక దేశం చేరాడు. అదొక చిన్న రాజ్యం. చంద్రకాంతుడు రాజుగారి దర్శనం చేసుకుని ఆయనకు తనవద్ద వున్న అయిదువేల వరహాలూ అర్పించుకున్నాడు. లోభి అని ప్రసిద్ధికెక్కిన ఆ రాజు వరహాల మూట చూడగానే పరమానందం చెంది, "ఎవరు మీరు? నావల్ల మీకు కావలిసిన సహాయం ఏమిటి?" అని అడిగాడు.

"మహారాజా, నాకు మడులూ మాన్యాలూ వద్దు. నన్ను రోజూ మీ సభకు రానివ్వండి. అక్కడ నాతో మీరు రోజూ రెండు నిమిషాలపాటు ఏకాంతం మాట్లాడాలి. అలా చేసినట్టయితే నేను మీకు ఇలాగే రోజూ అయిదువేల వరహాలు ఇచ్చుకుంటాను," అని చంద్రకాంతుడు రాజుతో అన్నాడు.

రాజుకు ఆశ్చర్యంవేసింది, ఆశకూడా పుట్టింది. ఆయన కొలువులో చాలామంది వున్నారు. అందరూ డబ్బు పుచ్చుకునే వారేగాని, ఇచ్చేవారు ఒకరూ లేరు. ఈ యువకుణ్ణి కొలువులో చేర్చుకుని ఏకాంతం మాట్లాడటానికి రాజు సమ్మతించాడు.

మర్నాడు చంద్రకాంతుడు రాజసభకు వెళ్ళాడు. సభికులలో ఎవరెవరు యేపాటి



ధనవంతులో అరా తీశాడు. ఆరోజు రాజుతో ఏకాంతం మాట్లాడేటప్పుడు ఒక ధనికుడి కేసి పరీక్షగా చూడసాగాడు.

సభ ముగియగానే ఆ ధనికుడు చంద్ర కాంతుణ్ణి సమీపించి, "అయ్యా, రాజు గారు తమతో ఏదో రహస్యంగా మాట్లాడారు. అంతసేపూ మీరు నన్నే చూశారు. నాపై దయ ఉంచి అదేదో సెలవిస్తారా? మీ ఋణం ఉంచుకోను. నా శక్తికొద్దీ ఇచ్చు కుంటాను!" అన్నాడు.

"రాజుగారికి మీమీద చాలా గుర్రుగా వుంది. కారణం ఏమిటో తెలియదు!" అన్నాడు చంద్రకాంతుడు.

ఈ మాట వినగానే ధనికుడు బెదిరి పోయి, "రాజుగారికి నామీద వున్న కోపం పోగొట్టండి. నేను మీకు యెంత కావలిస్తే అంత ఇస్తాను," అన్నాడు.

"పదివేల వరహాలివ్వండి. రాజుగారికి మీమీద అనుగ్రహం కలిగేటట్టుగా అయ నకు మీ తరఫున మంచి బహుమానం ఇస్తాను," అన్నాడు చంద్రకాంతుడు. ధని కుడు పదివేలు ఇచ్చుకున్నాడు. అందులో అయిదు వేలు తీసుకుపోయి చంద్ర కాంతుడు రాజుగారి కిచ్చాడు.

ఇదేవిధంగా చంద్రకాంతుడు రోజూ రాజుగారితో ఏకాంతం మాట్లాడటమూ,



మాట్లాడుతున్నంతసేపూ సభలో ఒకరికేసి చూడటమూ, వాడు బెదిరిపోవటమూ, చంద్రకాంతుడు డబ్బు కాజేసి అందులో అయిదువేలు రాజు కివ్వటమూ జరుగుతూ వచ్చింది. వారూ వీరూ అని విచక్షణ లేకుండా, మంత్రుల దగ్గిరనుంచీ అందరూ ఎప్పుడో ఒకప్పుడు చంద్రకాంతుడికి లంచా లిచ్చుకున్నవారే.

వాడు తనకు రోజూ ఇచ్చే డబ్బుతో రాజే ఎంతో ధనవంతుడయాడు. ఆయనకు వాడి మీద అమితమైన గురి ఏర్పడింది. అందు చేత రాజ్యమంతటా వాడి పలుకుబడి హెచ్చింది. దానికి తగ్గట్టుగా వాడు, వారి దగ్గిరా వీరి దగ్గిరా లంచాలు గుంజి అపార మైన ధనం సంపాదించాడు.

ఇక్కడ ముసలి వర్తకుడూ, ఆయన పెద్ద కొడుకులూ, వారి భార్యలూ, పిల్లలూ చాలా దీనస్థితికి వచ్చారు. వారికి సరిగా తిండికూడా లేక పస్తులుంటున్నారు. ఇటు వంటి పరిస్థితిలో ఒకనాడు పన్నెండు మేనాలూ, వందలకొద్దీ కావళ్లూ వారి ఇంటి ముందు ఆగాయి. రాజభటులు లోపలికి వచ్చి, "ఫలానివారు తమరేనా?" అని వర్త కుణ్ణి అడిగారు. ఆయన అవునన్న మీదట కావళ్ళలో తెచ్చిన నగలూ, బట్టలూ, ధనమూ, సంబారాలూ లోపలికి చేర్చి, "తమ మూడవ కుమారుడుగారు తమకోసం ఇవన్నీ పంపారు. తమరు ఎప్పుడు బయలు దేరితే అప్పుడు మేనాలు సిద్ధంగా వున్నాయి" అన్నారు రాజభటులు.

వర్తకుడికీ, ఆయన పెద్ద కొడుకులకూ అమితమైన ఆనందం కలిగింది. దొంగ అవుతానన్నవాడే ఇంత ప్రయోజకుడైనం దుకు వారు ఆశ్చర్యపోయారు. వాడు తమ కోసం పంపిన బట్టలూ, నగలూ ధరించి వారు ఆ సాయంకాలమే మేనాలలో ఎక్కి, సంతోషంగా చంద్రకాంతుడి దగ్గిరికి బయలుదేరి వెళ్ళిపోయారు.





# మిత్రభేదం

దమనకుడు :

వినవయ్య మిత్రమా - వివరంబుగాను
మును దంతిలుని కథ-మనసుంచి వినుము.
వర్ధమానమ్మను - పట్టణమ్మొకటి
వర్ధిల్లు, నందున - వర్తకుం డుండె
దంతిలుం డనువాడు - ధనికు డాతండు
ఎంతయు పురజన-హితమును సేయు
సంతోషముగ రాజ-సన్మానమందు
వింతగా ప్రజలకు - విభునకుగూడ
నచ్చినవాడయి - నడచు నా సెట్టి
ఎచ్చట నిట్టి క-థే వినుటరుదు.
పెండ్లిసేసెను సెట్టి - బిడ్డకు; ఊరి
ఇండ్లలో పాయి రా-జనివ్వనీలేదు.
ఊరందఱిని పిల్చి - ఉచిత సత్కార
మారసి చేసె మ-ర్యాదస్తు డతను.
రాజును బిల్చి స-ర్వము కానుకలిచ్చె;
రాజింటి మనిషి గో-రంభకు డంత
వచ్చి కూర్చుండె స-భావేది ముందు
చెచ్చెఱ సెట్టి త్రో-సెను వాని బైట.
అందుతో ఉగ్రుడై-నాడు సేవకుడు
కుందుచు సెట్టిని - కూల్చంగ దలచె.
దొర నిద్రమేల్కొను - తరుణమ్మునందు
సరి కసవూడ్చుచు - స్వప్నమన్నట్లు
"అయ్యో దంతిలుడు మ-హారాణి జేరె
అయ్యయో ఇది న్యాయ-మా" అని గొణిగె.
విన్నదే తడవుగా - విభుడు మేల్కాంచి
అన్నా వదేమిరా - అని అదలించె.
'దొర! నిద్రలేక యే-దో తూగువచ్చె,
అరనిద్రలో నేమి - అంటినో యెఱుగ'
అనె, కాని రాజుకు - అనుమానమయ్యె
తనకు ద్రోహము సేసె - దంతిలుండనుచు.
కోటలో కాలుంచ-కూడదన్నాడు
ఏటికో తెలియక - ఏడ్చె దంతిలుడు.
వాకిటి కావలి-వారు పొమ్మన్న
లేకి గోరంభుడు - లీలగా నవ్వె.
అది కాంచి వీని కా-ర్యమె ఇది యంచు

విద్వాన్ విశ్వం



ఒదిగి వానిని బిల్చి - ఒక యినా మిచ్చి
గౌరవమ్ముగ పంప-గా వాడు మురిసె
ఆ రాజు మేల్కను-నప్పుడే గొణిగె.
'ఆచారమే లేదు - అయ్యొ రాజునకు
తెచ్చినదే తిను - లేకి వస్తువుల'
అన రాజు లేచి ఏ-మంటి వన్నాడు.
'కను మూతపడె. ఏదొ - కలవరిం' పనియె.
మామూలు వీనికి - మగతలో మాటలు—
ఏమాత్ర మివి నిజ-మే కావటంచు;
దొర నిశ్చయించి తొం-దర భటు బంపి
మరల సెట్టిని బిల్చి - మన్నన చేసె.

* * *

కావున సంజీవ-కా చెప్పచుంటి
నా వాడు దొర యని - నన్వీడకయ్య!

సంజీవకుడు :

నిజమోయి దమనకా! - నిజము నీ మాట
కుజనుడనా? నిన్ను - గోల్పోవ నెపుడు.
అంతట వారిద్ద - రరిగిరి, మఱి
చెంతకు, దొర ముందు - చేతులు మోడ్చి
సవినయమ్ముగ మ్రొక్కె - సంజీవకుండు
చెవిలోన నితడని - చెప్పెను మంత్రి.
మృగరాజు చేయెత్తి - మేలిమి గిత్త
సొగసు మూపురమును - సోగగా దువ్వి,
సేమమా మిత్రమా - సేమమా నీకు
ఈ మాడ్కి నొంటిగా - ఏల వచ్చితివి?
అని ఆదరమ్మున - నడుగుచుండంగ



విని గిత్త ఆనంద-మును చెంది నిలిచె.
అంత సంజీవక - మా సింహమునకు
వింతయౌ తన కథ - సొంతమ్ము చెప్పె.

పింగళకుడు :

భయమేమి లేదు నా - పాలనలోన
భయదూరుడై నీవు - బ్రదుకగావచ్చు.
ఒకటి మాత్రము బుద్ధి నుంచి వర్తించు
ఒకసారి నన్ వీడి - ఒంటరి గాకు.
దారుణ మియ్యది - ఘోర కాననము
క్రూరజంతువు లిట - క్రుమ్మఱుచుండు-
బలవంతు లైనట్టి - బహుళ మృగాలె
తలకు, నీవంటి సా-ధుల మాట యేమి ?
అని చెప్పి మృగముల - నందఱ బిలిచి
చని యమునానది - చల్లని జలము
కడుపార గ్రోలి పిం-గళకుండు చనియె
తడబాటు మఱచి ఆ - అడవి లోపలకు.
అచ్చట గిత్తకు - అత్యాప్త డగుచు
ముచ్చటలాడుచు - మురిసె నా రాజు.
కతలు కారణములు - జత గూరుచుండి
సతతమ్ము సద్గోష్ఠి - జరుపుచు నుండె.
కరటక దమనకుల్ - కాంతార రాజ్య
భరమెల్ల మోసిరి - పాలకు నాజ్ఞ.
సకల శాస్త్రమ్ముల - సార మెఱింగి
చకచక నా గిత్త - సార్వభౌమునకు
నీతులు నేర్పె కొ-న్నే నాళ్లలోన
ఘాతుకత్వము పోయె-గద సింహమునకు.



దిన దినమ్మును సింహ-మునకు నెద్దునకు
ఎనలేని సావాస - మెంతయో బలిసె—
వారిద్దఱే చేరి - వద్దిక నుండ
దూరమ్ముగానె జం-తువులు నిల్చుండు.
కరటక దమనకుల్ - కానివారైరి
దొర వేట వెడలుటే - కఱవయిపోయె.
కడుపు మండుచు నుండె-గద జంతువులకు
కడుపు నింపని రాజు - నడపీనుగయ్యె.
పొట్ట పూడ్చని దొర - పొలివుత్తు రెపుడు
చెట్ట సేవకులు వీ - డెట్టి రాజనుచు.
కరటక దమనకుల్ - దొర దూరమైన
బిరబిర ఒక చోట - భీతితో చేరి
కఱవయ్యె తిండికి - కర్తవ్య మేమి
ఎఱుగక యిట్లు యో-చింపదొడంగె:

దమనకుడు :

మన మాట మఱచెను - మన మృగరాజు
వినుచుండె సంజీవ-కుని మాట లెపుడు.
తన వేట సంగతి - తలపెట్టడయ్యె;
మనుచుండె అ స్థాన-మున మృగరాజు.
ఏమి సేయుద మిప్పు - డెట్లు సేయుదము
ఈ మాడ్కి గూర్చుండ - నేమి లాభమ్ము.

కరటకుడు :

దొర విన్న వినకున్న - సరియె నీకేమి
సరిగా దటంచు నా - దొరకు చెప్పించు
దొర దారి దప్పిన - దూషింత్రు జనులు
సరియైన మంత్రి అ-చ్చట లేడటంచు.
అ యెద్దు గొని వచ్చి - యటు చేతులార
నీ యడివికి చిచ్చు - నీవె పెట్టితివి.

దమనకుడు :

ఔనోయి మిత్రమా - ఔను నీ మాట
నేనె దోషిని రాజు - నేమన రాదు.
చేజేతులార నే - చేసుకున్నాను
వాజమ్మనై యిట్లు - వగచు చున్నాను.
ఎవరి తప్పున వారు - రవరవ పడుట
అవును సామాన్యమే - అ కథ వినవె?

కరటకుడు :

అది యేమి కథ మిత్ర-మా అది యేమి?
కొదువ బెట్టక చెప్పు - ముదమార విందు.



# తాతయ్యా - దీపావళి





దీపావళి రోజున మనమడూ, మనమరాలూ ఎంత పిలిచినా, తాతయ్యా పడకకుర్చీలోంచి కదల లేదు. "మీరు టపాకాయలు కాలుస్తూంటే, నేను చూసేదేమిటి? నాకు కదిలే ఓపిక లేదు, పోండి!" అన్నాడు తాతయ్యా. "నీకు కదిలే ఓపికకూడా లేదా? నీచేత పరిగెత్తిస్తాం వుండు!" అంటూ, మనమడూ, మనమరాలూ కలిసి, తాతయ్యా పడుకున్న కుర్చీకింద టపాకాయ కాల్చి పడవేశారు. కదిలే ఓపికకూడా లేదన్న తాతయ్యా, టపాకాయ మోత వింటూనే, కుర్చీలోంచి లేచి, దౌడుతీశాడు. మనమడూ మనమరాలూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వారు.







# ఉత్తర ధృవం: దీపోత్సవం

దీపావళి ఎలా పుట్టింది? మనం ఆ ఉత్సవం ఎందుకుగాను చేసుకుంటున్నాం? దీపావళికి ముందు రోజు నరకచతుర్దశి. ఆ రోజు శ్రీ కృష్ణుడు నరకాసురుడనే లోక కంటకుణ్ణి చంపాడన్న కథ మనం ఎరిగినదే. లోక కంటకుడు మరణించాడు గనక దీపోత్సవం చేసుకుంటున్నామని కొందరి అభిప్రాయం. వామనమూర్తి బలిచక్రవర్తిని పాతాళలోకానికి పంపినది దీపావళినాడే అని కొందరి ఉద్దేశం. శ్రీరాముడు రావణ సంహారానంతరం పట్టాభిషేకం చేసుకున్నదికూడా దీపావళినాడేనని కొందరి ఉద్దేశం. అయితే దీపావళికి ఇంకొక కారణంకూడా ఉన్నట్టు కనబడుతుంది.

మన పూర్వీకులు అనేక వేల ఏళ్ల క్రితం ఉత్తర ధృవప్రాంతంలో ఉండేవారనటానికి వేదాలలో ఆధారాలున్నాయి. అదే స్వర్గధామంకూడా అయివుండవచ్చు. ఎందుచేతనంటే దేవలోకంలో ఒక రోజు మానవలోకానికి ఒక ఏడాది అని వేదాలలో చెప్పి వున్నది. ఉత్తర ధృవప్రాంతాన ఏడాదిలో ఒక పగలూ, ఒక రాత్రి మాత్రమే నని మనం భూగోళశాస్త్రంలో చదువుకున్నాం. ధృవప్రాంతపు పగళ్లను దీర్ఘ దివసాలనీ, రాత్రులను దీర్ఘ రాత్రులనీ అంటారు.

ఇవి ఎలా ఏర్పడతాయో జ్ఞాపకం చేసుకుందాం. ఏడాదికి రెండు రోజులు మాత్రమే—మార్చి, 22-న, సెప్టెంబరు 22-న—సూర్యుడు భూమధ్య రేఖకు ఎగువగా ఉంటాడు; ఉత్తరాయణం ఆరు మాసాలూ భూమధ్య రేఖకు ఉత్తరంగా, 1600 మైళ్ళు పోతాడు; అలాగే దక్షిణాయనంలో సూర్యుడు భూమధ్యరేఖకు 1600 మైళ్ళు దక్షిణంగా పోతాడు. సెప్టెంబరు 22 దాటగానే ఉత్తర ధృవాన సాయం సంధ్య ప్రారంభమై కొద్ది రోజులలోనే దీర్ఘరాత్రి ఆరంభమవుతుంది.

ఆ ప్రాంతంలో మన పూర్వీకులు నివసిస్తూ ఉండినప్పుడు వారికి ఈ

రాత్రి భయంకరమైనదిగా ఉండేది. ఆ దీర్ఘ రాత్రిలో వారు ఏ పనీ చేయలేక పోయేవారు. పుణ్యాత్ములైనవాడు చావటానికికూడా పనికిరాని రాత్రి అది! ఆ రాత్రి ప్రారంభంకాగానే అక్కడి వారు దీపాలు వెలిగించేవారు. దీపాలు లేకుండా పితృదేవతలు కూడా దారి తెలుసుకోలేరు!

ఈ కాలంలో ఉత్తర ధృవ ప్రాంతంలో నివసించే మనుష్యుల సంఖ్య చాలా తక్కువ. అయినప్పటికి నాగరక ప్రపంచం అక్కడ ప్రారంభమైన ఆచారాన్ని ఇప్పటికీ పాటిస్తూ వుండటం చిత్రమైన విషయం. భారతీయులు దాదాపు అందరూ దీపోత్సవం చేస్తారు. కొంతమంది కార్తీక మాసం పొడుగునా రాత్రివేళ కార్తీక దీపాలు వెలిగించి, దూరంనుంచి కార్తీకదీపం సయితం ప్రయాణీకులకు కనిపించేటట్టు ఎత్తుగా పెడతారు!

జపానులోకూడా ఏడాదికొకసారి దీపోత్సవం జరుగుతుంది. ఆ రాత్రి అందరూ లాంతర్లు తీసుకుని శ్మశానాలకు వెళ్ళి, చనిపోయినవారి సమాధులవద్ద పూజలుచేస్తారు. లాంతర్లు దేనికంటే పితృదేవతలకు చీకటిలో దారి తెలియటానికి!

దీపాలు వెలిగించే ఆచారం ధృవ ప్రాంతంలో ప్రారంభమయినప్పటికీ దీపావళినాడు టపాసులు కాల్చటం వగైరా సంబరాలన్నీ తరవాత ఏర్పడినవే. మనకు టపాకాయలు చీనానుంచి వచ్చివుండవచ్చు.

దీపావళి ఉత్సవాలను కొందరు విక్రమాదిత్యుడితో ముడిపెడతారు. రెండువేల ఏళ్లక్రితం ఈయన ఉత్తర భారతాన్ని పరిపాలించి అనేక కథలకు నాయకుడుగా జానపద సాహిత్యంలో ఇప్పటికీ నిలిచివున్నవాడు. కొందరు భారతీయులకు దీపావళి ఉగాదిపండగ.

ఏమైనప్పటికీ దీపావళి భారతీయుల గొప్ప పండగలలో ఒకటి. అది ప్రజలలో ఉత్సాహ చైతన్యాలను రేకెత్తించటమేగాక మనదేశంలో వుండే అన్ని ప్రాంతాలవారినీ సోదరులనుగా, ఒకే కుటుంబంగా, చేయగల పండగ.





# రేజరు బ్లేడుతో బొమ్మలు



ఈ దిగువ బొమ్మలు "చందమామ" పాఠకులు ఒకరు పంపినవి. వీటిని ఆయన రేజరు బ్లేడు సహాయంతో అందంగా తయారు చేశారు. ఇలాటివి తయారుచేయటానికి ఎంతో నైపుణ్యమూ, ఓపికా అవసరం.













# గంగరేగి పళ్లమ్మి

ఒక రాజు ఒకనాడు వీధివెంట పోతూ ఒక గంగరేగి పళ్లమ్మిని చూశాడు. ఆ మనిషి గొప్ప అందగత్తె. ఆమె అందానికి ముగ్ధుడై రాజు ఆమెను పెళ్ళాడి తనకు రాణిగా చేసుకున్నాడు.

కొద్ది సంవత్సరాలు గడిచాక, ఒకనాడు రాజుగారు గంగరేగి పళ్ళు తింటూండగా చూసి రాణీగారు, "స్వామీ, మీరు తినేవి ఏమి పళ్ళు ?" అని అడిగింది.

"అంతలోనే మరిచావా? ఈ గంగరేగి పళ్ళేకదా మీ కుటుంబానికి ఒకప్పుడు ఆధారం?" అని రాజు కోపంగా అడిగాడు.

రాణీగారి మతిమరుపు చూసి రాజుగారికి ఆగ్రహం వచ్చిందని మంత్రి గ్రహించాడు. "మహారాజా, స్త్రీలు హోదాతోబాటు సులువుగా మారిపోతారు. ఆమెకు మహారాణీహోదా ఇచ్చినది తమరేగద! కనుక శాంతించండి!" అన్నాడు మంత్రి.



# వింత మామిడిపళ్లు

ఒక ధనికుడి కుమార్తెకు వివాహం జరిగింది. అనేక వేలమంది భోజనాలకు బారులుతీరి కూర్చున్నారు. అనేక పిండి వంటలతోబాటు మేలు రకం రసాలు కూడా తెచ్చి విస్తళ్లలో వడ్డించారు. ఎందుకంటే అది మామిడిపళ్ల తరుణం.

విందులో ఇద్దరు పెద్ద మనుషులు పక్కపక్కనే కూచున్నారు. అందులో ఒకడు మామిడి పండు తింటూండగా టెంక ఎగిరి పక్కవాడి విస్తట్లోపడింది. అతను యాగీపెట్టి, అల్లరి చేసి రసాభాసు చేస్తాడేమోనని మొదటివాడు భయపడ్డాడు గాని, అదృష్టవశాత్తూ రెండోవాడు సందట్లో ఈ విషయం గమనించనేలేదు.

కొంత సేపయాక రెండోవాడు కూడా తన మామిడి పండు తినేసి తన విస్తట్లో రెండు టెంకలుండటం చూశాడు. ఆయన పక్కవాడితో, "ఈ వింత చూశారా? నా మామిడి పండులో రెండు టెంక లున్నాయి!" అన్నాడు.

"అసలివి వింత మామిడి పళ్లులెండి! నేను తిన్న మామిడి పండులో అసలు టెంకే లేదు. దానికే మంటారు?" అన్నాడు రెండోవాడు.

"అవును సుమండీ!" అన్నాడు మొదటివాడు ఆశ్చర్యపోతూ.



# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 జనవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబరు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## నవంబరు నెల ఫోటో ఫలితాలు

మొదటి ఫోటో : సంతోషానికి సాటూ లేదు...

రెండవ ఫోటో : ఆలోచనకు అంతూ లేదు!

పంపినవారు : బూరాడ చంద్రకళావతి. C/o శ్రీ బి. సత్యనారాయణమూర్తి, మల్లికార్జునపేట, - విజయవాడ.

బహుమతిమొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చేపలు

చేపలను చూడని వాళ్లు ఎవరూ ఉండరు. చాలా మంది వాటిని తింటారు. కొందరు రంగు రంగుల చేపలను నీటితొట్లలో పెట్టి పెంచుతారు. చేపలు నీటిలో తప్ప బతకలేవని మనకు తెలుసు. అనేక జంతువులు నీటిలో పడి ఊపిరాడక చచ్చి పోతాయి. చేపలు గాలిలో ఊపిరాడక చచ్చి పోతాయి.

కాని నీటిలోనే పుట్టి పెరిగే అనేక జంతువులు చేపలు కావు. అవి వెన్నెముక లేని జంతువులు. చేపలు వెన్నెముక గలవి.

చేపలలో కూడా అనేక రకాలున్నాయి. వాటిలో కొన్నిటికి ప్రత్యేక లక్షణాలు కూడా ఉన్నాయి. వాటిని గురించి తెలుసు కుందాం. కొమ్ముసొర (లేక, బొంతచేప) అనే దానికి మూతి కత్తిలాగా పొడుచుకు వస్తుంది. ఎగిరేచేప ఒకటి ఉన్నది. అది నీటి మీది నుంచి గాలిలోకి లేచి అనేక వందల అడుగుల దూరం గాలిలో ఎగురుతుంది. మరొక రకం చేప నీటిలో నుంచి ఒడ్డుకు వచ్చి తోకను మాత్రం నీటిలో ఉంచుతుంది; అది నీటి నుంచి ఊపిరి పీల్చటానికి తోక ఉపయోగ పడుతుంది.

ముళ్లచేపకు ముళ్లపందిలాగా ఒంటి నిండా ముళ్లుంటాయి. అపాయం కలిగి నప్పుడా ముళ్లు నిక్క బొడుచు కుంటాయి. మరొక చేపకు తోకలో ముల్లున్నది, దీనితో ఇది శత్రువును పొడుస్తుంది. కొన్ని చేపలకు ఎముకలాటి కవచం ఉంటుంది. కాని ఎక్కువ చేపలకు ఆయుధాలుండవు. వాటిని ఇతర జంతువులు సులువుగా తినేస్తాయి. దాక్కోపటమూ, వేగంగా ఈదుకు పోపటమూ తప్ప వాటికి వేరే ఆత్మరక్షణోపాయం లేదు. ఒక రకం చేప నీటి అడుగుకు వెళ్లి ఊసరవెల్లిలాగా రంగుమారి ఆత్మరక్షణ చేసు కుంటుంది. పెద్ద అయాక ఆత్మరక్షణ చేసుకోగల చేపలు కూడా చిన్న తనంలో ఇతర జంతువులకు ఎర అయిపోతాయి. కనకనే తల్లి చేపలు లక్షల కొద్దీ గుడ్లు పెట్టినా, అవన్నీ చేపలు కాలేవు.

చేపలలో కూడా మాంసాహారులూ, శాకాహారులూ ఉన్నాయి. శాకాహారులైన చేపలు నీటి మొక్కలను తిని బతుకుతాయి. చేపల కుండే ముక్కులు గాలి పీల్చటానికి కాక



పోయినా, వాసన చూడటానికి పనికి వస్తాయి. చేపలు తాము తినబోయే వస్తువును మూచూడటం మనం గమనించవచ్చు.

చేపల కన్నిటికీ కళ్లుంటాయి, కాని కనురెప్ప లుండవు. వాటి కళ్లు ఎప్పుడూ తెరుచు కునే ఉంటాయి. సముద్రపు లోతుల్లో పట్టపగలే కటిక చీకటిగా ఉంటుంది. అటువంటి చోట నివసించే కొన్ని చేపలకు "దీపాలు" ఉంటాయి; వాటి వెలుతురులో ఆ చేపలు చూడ గలుగుతాయి. ఒక రకం చేపకు తలమీద కొమ్ములాటిది ఉంటుంది. ఆ కొమ్మ చివర వెలుతు రుంటుంది. చాలా చేపలకు చెవులుంటాయి గాని అవి పైకి కనబడవు. చేప వినగలదో లేదో చెప్పలేం.

నీటిలో ఈదటం తప్ప చేపలు సంచరించటానికి మరోమార్గం లేదు. అందుచేత వాటి శరీరాలు ఈతకు అనుకూలంగా ఉంటాయి. చేపతోక తెడ్డులాగా పనిచేస్తుంది, రెక్కలు "బాలెన్సు" కు అవసరం. చేపలకు గాలి తిత్తులుంటాయి. వీటిలోకి గాలి పీల్చి చేప పైకి లేస్తుంది, గాలిని వదిలేసి అడుగుకు దిగుతుంది.

కొన్ని చేపలు ఉప్పు నీటిలోనూ, మరికొన్ని మంచి నీటిలోనూ బతుకుతాయి. వాలగలు, జెల్లలు, బొచ్చెలు మొదలైనవి మంచి నీటిలో బతికేవి. తవుటి పాములు కూడా చేపలేగాని, చూడటానికి పాముల్లాగా ఉంటాయి. ఇవి కొంతకాలం మంచి నీటిలోనూ, కొంతకాలం ఉప్పు నీటిలోనూ ఉంటాయి. ఇందు కోసం అవి నదుల నుంచి సముద్రానికి వెళ్లి అక్కడ గుడ్లు పెడతాయి; పిల్లలు పెద్దవై నదులకు తిరిగి వస్తాయి. చేప నూనెను మనం అనేక రకాల ఉపయోగిస్తాం.

మనం తొట్లలో పెంచే రంగు చేపలను మొట్టమొదటగా చీనావారు అభివృద్ధి చేశారు. తరవాత జపానువారు కూడా ఈపని చేశారు. ఈ నాడు వీటిలో చాలా రకాలున్నాయి. వీటిని ప్రపంచ మంతటా పెంచుతున్నారు.





# ఇంద్రజాలము

ప్రొఫెసర్ పి. సి. సర్కార్

ఇంద్రజాలికునికి ముందు ఓ గాజును తీసుకువచ్చి ఇవ్వాలి. అది గుండ్రంగా ఎక్కడా అతుకు లేనిదై ఉండాలి. తర్వాత ఇంద్రజాలికుని చేతులకు పొడుగాటి త్రాటినికాని, రిబ్బన్నుకాని కట్టాలి. మణికట్టుమీద దానిని ముడి వేసిన చోట సీలునుకూడా వేయవచ్చు. ఇహ ఆ గాజుని అతడి చేతికిచ్చి, అతడి చేతుల్ని పెద్ద జేబు రుమాలతో కాని, తువాలుతోకాని కప్పివేయాలి. మరుక్షణంలో ఆ పైన కప్పిన తువాలు తొలగించేసరికి ఆ గాజు అతడి చేతులకు కట్టివున్న రిబ్బను మధ్యకి వచ్చి ఉంటుంది. అతడి చేతులకు కట్టివున్న రిబ్బను ఎక్కడా కత్తిరించి ఉండదు. ఆ ముడులమీద వేసిన సీళ్లుకూడా చెక్కుచెదరకుండానే ఉంటాయి. గాజుకూడా ఎక్కడా అతుకుపెట్టినట్లుండదు—అయినా మరి ఆ గాజు రిబ్బను మధ్యకి వచ్చి ఎలా వ్రేలాడుతోంది? అదే సమస్య అందరికీ! మళ్లీ తువాలు చేతులమీద కప్పి తీసివెయ్యగానే, ఆ గాజును తీసి ఇంద్రజాలికుడు అక్కడున్నవారికి ఇస్తాడు. ప్రక్కన ఉన్న చిత్రంలో ఇంద్రజాలికుని చేతులకు కట్టివున్న రిబ్బను మధ్యకు గాజు వచ్చివుండటం—ఒక సహచరుడు తువాలును పట్టుకుని ఉండటం చూపబడింది. ఈ కిటుకు చాలా సులభం.

ఒకే అకృతి-ఒకే అదికల గాజులు రెండు కావాలి. ఒక గాజును ఇంద్రజాలికుడు ముందుగానే చేతికి తొడుక్కుని ఉంటాడు. అది అతని కోటు చేతుల లోపల ఉండటంవల్ల పైకి ఎవరికీ కన్పించదు. ప్రేక్షకుల్లోంచి ఒకరు తెచ్చియిచ్చిన గాజును—చేతు

లకు తువాలు కప్పగానే దాన్ని అతడు కోటు జేబుల్లోనో, కోటు గుండీల అడుగునో దాచేస్తాడు. తాను అదివరకు తొడుక్కొనివున్న గాజును చేతిమీదుగా జార్చి, ఆ రిబ్బను మధ్యకి తెప్పిస్తాడు. తాము యిచ్చిన గాజే ఆ రిబ్బను మధ్యకి వచ్చిందని అందరూ అనుకుంటారు. మళ్లీ తువాలు కప్పగానే రిబ్బను మధ్యన వున్న గాజును చేతిమీదుగా కోటు చేయి లోపలికి పోనిచ్చేసి, తాను జేబులోనో ఎక్కడో దాచిన గాజుని తీసి, గంభీరంగా అక్కడున్న వారికిచ్చేస్తాడు. ఈ కిటుకు చేసేటప్పుడు ఐంద్రజాలికుని ప్రవర్తన, తీరు, ఆ చేసే పద్ధతి నిర్దుష్టంగా ఉండాలి. అప్పుడే దాన్ని చక్కగా చేసి చూపటానికి వీలౌతుంది. ముందు కొన్నిసార్లు అభ్యాసం చేసిచూసుకుని, తర్వాత పదిమంది ఎదుటా చెయ్యటం మంచిది.





# వార్తలు-విశేషాలు

ద్వితీయ పంచవర్షప్రణాళిక కింద, ఆంధ్రరాష్ట్రంలో ప్రారంభించనున్న పట్టణ నీటి సరఫరా మురుగు కాల్వల పథకాలకుగాను, దేశం మొత్తానికి కేటాయించబడిన 30 కోట్ల రూపాయిలలో, 2 న్నర కోట్లు ఆంధ్రరాష్ట్రానికి కేటాయించాలని ఆంధ్రప్రభుత్వం, కేంద్రప్రభుత్వాన్ని కోరింది. ఈ మొత్తం త్వరలో మంజూరు కాగలదని తెలుస్తున్నది.

*　　　*　　　*　　　*

ముడి ఫిల్ము ఉత్పత్తికి, ఊటీలో ఫ్యాక్టరీ నొకదానిని నెలకొల్పవచ్చునని, తూర్పు జర్మనీ నుంచి వచ్చిన ప్రవీణులు కొందరు కేంద్రప్రభుత్వానికి నివేదిక సమర్పించారు. ఈ నివేదికను కేంద్రప్రభుత్వం పరిశీలిస్తున్నది. దాదాపు ఏడు కోట్ల రూపాయిల ఖర్చుతో యీ ఫ్యాక్టరీని నిర్మించవచ్చు.

*　　　*　　　*　　　*

ఆంధ్రరాష్ట్రంలో, ప్రస్తుతం అసుపత్రులు లేని రెవిన్యూ ఫిర్కా ప్రధాన కేంద్రాలన్నిటిలోను, అసుపత్రులను స్థాపించటానికి ఆంధ్రప్రభుత్వం నిశ్చయించింది. ఈ నిర్ణయంవల్ల 51 రెవిన్యూఫిర్కా కేంద్రాలలో వెంటనే ఆసుపత్రులు ప్రారంభించబడగలవు.

*　　　*　　　*　　　*

ఇండియాలో, మొదటి పంచవర్షప్రణాళికలో, మొత్తం 400 సమాజాభివృద్ధి కేంద్రాలను నిర్వహించాలని నిశ్చయించబడింది. ఈ సంవత్సరం 64 జాతీయ వికాసకేంద్రాలను సమాజాభివృద్ధి కేంద్రాలుగా మార్చడంతో ఆ మొత్తం పూర్తిఅయింది.



ఈయేడు గాంధిజీ జయంత్యుత్సవం దేశమంతటా అత్యంత వైభవోపేతంగా జరిగింది. లండన్‌లో, మహాత్మునితో సన్నిహిత పరిచయం గల ప్రముఖుల అభిప్రాయాలను వివరిస్తూ బి. బి. సి. కార్యక్రమం ద్వారా బ్రాడ్‌కాస్టు చేయబడింది.

* * * *

ఇదివరలో భూదానం, సంపత్తిదానం, శ్రమదానం, జీవనదానం, గ్రామదానం అర్థించిన వినోబాభావే ఇప్పుడు 'మనుష్యదానం' చెయ్యవలసిందని అర్థిస్తున్నారు. అవిభక్త కుటుంబాలవారు ఒక్కొక్క వ్యక్తిని కేవలం సంఘసేవ చెయ్యటానికి వదలటమే ఈ 'మనుష్యదానం'.

* * * *

ఉత్తరప్రదేశ్ ఘాజీపూర్‌లోని కాలేజి విద్యార్థి శ్రీ అక్షయకుమార్ సింగ్‌కు (14 ఏళ్ళ వయస్సు) మూడవతరగతి అశోకచక్రాన్ని ఇండియా ప్రెసిడెంటు బహూకరించబోతున్నట్టు అసాధారణ గెజట్‌లో ప్రకటించబడింది. 1953 డిసెంబరు 21 న రైలు ప్రమాదాన్ని నివారించి సాహసం చూపినందుకు ఈ బహుమతి ఇవ్వబడుతున్నది.

* * * *

రెడ్‌క్రాస్ రాజమండ్రిశాఖ అధ్వర్యాన శిశు ప్రదర్శన సభ జరిగింది. 68 మంది పిల్లలు— 2 సంవత్సరాలు లోపువారు—పాల్గొన్నారు. ఆరోగ్యవంతులు, పుష్టికరంగాను దృఢగాత్రులుగానూ ఉన్న నలుగురు బాలబాలికలకు బహుమతు లివ్వబడినై.

* * * *

దొంగకు విధించతగిన శిక్ష ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానంగా శ్రీ ఆచార్య వినోబాభావే ఇలా అన్నారు: 'దొంగను జైలుకు పంపించకుండా, ఏదైనా ఆశ్రమానికి పంపి, రెండెకరాల భూమి యిచ్చి, సాగు చేసికొమ్మని చెప్పడం మంచిది.'

* * * *

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకత్వానికి ఉప ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు.



# చిత్రకథ





దాసూ, వాసూలు ఒంట్లో బావో లేదని, స్కూలుకు సెలవు పెట్టి, నదికి స్నానానికి వెళ్ళారు. ఆ సమయంలో అక్కడ స్నానం చేస్తున్న ఒక ముసలి వాడు, నదిలో కొట్టుకు పోతూ, కేకలు పెట్టాడు. దాసూ, వాసూలు నదిలో దూకి ముసలి వాణ్ని రక్షించారు. అప్పుడు ఒక ఫోటోగ్రాఫరు అక్కడికి వచ్చి దాసూ, వాసూలను ఫోటో తీయబోయాడు. కాని, వాళ్లు 'టైగర్'ను ఫొటో తీసుకోమని పక్కకు తప్పుకున్నారు. కారణం: ఒంట్లో బావో లేదని బడి ఎగకొట్టి, నదికి స్నానానికి వెళ్లినట్టు తెలిస్తే, మాష్టరు కొడతాడని వాళ్ల భయం.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'

పడక కుర్చీలో
విశ్రాంతి సమయమున
3 డైమెన్షన్సులనూ రంగు
లనూ ఆనందించుటకు

# ట్రు - వ్యు

# Tru-Vue

ట్రు-వ్యు సాధనంతో మీరు, పడక కుర్చీ మహదానందాన్ని పొంద వచ్చును. అమెరికా దేశపు నగరాల అపూర్వ దృశ్యాలు, పర్వతాలు, అరణ్యాలు, నదీనదాలు, లోయలు — ఈ అద్వితీయ ప్రకృతి సౌందర్యాలను రంగురంగుల 3-డైమెన్షన్ చిత్రాలలో చూచి ఆనందించండి.

ఒక్కొక్క ఫిలిం కార్డుకు, హైటిల్సు గల 7 పెద్ద బొమ్మలు.



3 డి
వ్యూయర్ రు. 11-8-0
ఫిలిమ్ కార్డులు రు. 1-12-0
3కార్డులు లేక 3-కార్డు ఆల్బమ్ 5-4-0

Only Authorised Importer :

**CENTRAL CAMERA COMPANY PRIVATE LTD.**
195, HORNBY ROAD, - - - - - - - - - BOMBAY 1.

అధికారము పొందిన గుత్త దిగుమతిదార్లు:

సెంట్రల్ కెమెరా కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్
195, హారన్బీ రోడ్ - - - - - - - - - - - - - బొంబాయి - 1.

TEL R. P. C.

ఫౌంటెన్ కలములకు,
సిరాలకు
జగత్ప్రసిద్ధి పొందిన
పేరు

# పైలట్






మరల ఇప్పుడు
భారతదేశములో
ప్రతి చోట
లభించుచున్నవి

*

నాణ్యమునకు
పూచీ

MANUFACTURED BY
**THE PILOT PEN CO. (INDIA) LTD.**
CATHOLIC CENTRE, MADRAS-1.

---

మధుర పరిమళయుతమైన



రిజిష్టర్డు

# 'లోమా'

★ కురులను నల్లబరచును.

★ మెదడును చల్లబరచును.

★ 'లోమా' నే ఎల్లప్పుడు కొనండి.

సోల్ ఏజంట్లు : ఎం. ఎం. ఖంబట్‌వాలా
రాయపూర్ :: అహమదాబాదు

---




లిలీస్

# నోన్టా

బిస్కతులు

సాటిలేని వాటి రుచికీ,
నాణ్యతకూ బిడ్డలు ఎంతో
ఇష్టపడతారు.

L.B.10/56

**LILY BISCUIT CO. PRIVATE LTD., CALCUTTA-4**


PP




ఈ గుర్తుతోవున్న స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు గ్యారంటీ కలవి
చిలుము, తుప్పుపట్టవు. ఎల్లప్పుడు తెల్లగా మెరుస్తూ
వుండును తోముటకు చాల సులువైనవి.

'దీపావళీ బహుమతులు'గా ఇవ్వతగినవి

ఇండియన్ మెటల్ & మెటలర్జికల్ కార్పొరేషన్,

498, మింట్ స్ట్రీట్ :: మద్రాసు - 3










సన్‌లైట్

సబ్బు

బట్టలను తెల్లగాను, కాంతివంతముగాను ఉతుకును

S. 242-50 TL

నిరంతర సేవాదక్షులైన

## ది బి. ఎన్. కె. ప్రెస్ (ప్రైవేట్) లి.

చందమామ బిల్డింగ్స్ :: మదరాసు - **26**

మీ అందరకూ

ఈ పర్వ దినమున

స్వాగత మిస్తున్నారు.



నవభారత నిర్మాణానికి...





# దుర్గా బ్రాండు

## పోర్టులేండు సిమెంటు

ఉపయోగించబడుచున్నది

ఈసిమెంటు అధికంగా తుంగభద్రా ప్రోజెక్టు ఇతరపెద్ద ప్రాజెక్టుల పనులకు వాడ బడుచున్నది

మీ భవనములను ఎక్కువ ధృఢముగాను అందముగాను చేయును

## ఆంధ్ర సిమెంటు కంపెనీ లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీసు: 337 తంబు చెట్టి వీధి
మద్రాసు-1. Tele-{Grams: ANDHRACEM / Phone: 3502

ఫాక్టరీ ఆఫీసు: బక్కింగ్‌హామ్‌పేట పోస్టు
విజయవాడ-2. Tele-{Grams: CEMENTS / Phone: 557 (P.B.X)

Photo by J. V. Sivarama Sastry



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆలోచనకు అంతూ లేదు

పంపినవారు:
டి. సి. కళాపతి - విజయవాడ

